# సంపాదకీయం

"ఈనాడు చెప్పేవారు చాలామంది కనిపిస్తున్నారు. కాని ఆచరణలో పెట్టేటటువంటి ఘనులు ఒక్కరైనా కనిపించటంలేదు. కనుకనే దేశం ఇన్ని విధములైన అశాంతులకు గురి అవుతున్నది" అని భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు ప్రశాంతి నిలయంలో జరిగిన ది.(6-2-1998) చైనీస్ నూతన సంవత్సర మహోత్సవాలలో ప్రసంగిస్తూ ఆవేదనను వెలిబుచ్చారు.

బాబావారు ఆచరణకు అగ్రస్థానం యిస్తారు. స్వామి కోరేది ప్రచారం కాదు, ఆచరణ. వారు చెప్పింది చేస్తారు, చేసిందే చెబుతారు. అయితే ఈనాడు బోధించే వారి సంఖ్య పెరిగిపోతున్నది. ఆచరించేవారి సంఖ్య తరిగిపోతున్నది. బోధించిన దానిని ఆచరణలో పెట్టి చూపించటం బహుకష్టం. అందువలననే "చెప్పవచ్చు కోటి చేయరు ఒక్కటి" అని చమత్కరించారు బాబా. చెప్పటం తేలిక, చేయటం కష్టం. ఆచరణలేని వేదాంతం గ్రామఫోన్ రికార్డు వంటిది. చైతన్యం గల వ్యక్తి చేయవలసింది ఆచరణ. కేవలం ధర్మపన్నాలు వల్లె వేస్తే ప్రయోజనం లేదు. ధర్మం ఆచరించవలసిందే గాని, బోధించవలసింది కాదు. అందువలననే ఉపనిషత్తులు 'సత్యంవద, ధర్మం చర' అని చెప్పాయి.

ఇదే వాస్తవమును స్వామి వివేకానంద కూడా చెప్పారు. " Everyone wants to command and no one wants to obey; First, learn to obey, the command will come by itself. Always first learn to be a servant and then you will fit to be a Master". (ప్రతి ఒక్కరూ అధికారాన్ని చలాయించేవారే. అనుసరించే వారే లేరు. మొదట అనుసరించటం నేర్చుకో. అధికారం దానంతట అదే వస్తుంది. శిష్యుడుగా ఉండటం నేర్చుకో. గురుత్వం అదే లభిస్తుంది)

ఈనాడు ముఖ్యంగా రాజకీయ రంగంలో ఇదే మనకు కనిపిస్తున్నది. ఆచరించేవారు కనిపించటం లేదు, ఉపన్యాసాలు దంచేవారు మాత్రం కోకొల్లలు. అందరూ నీతులు చెప్పేవారే. నీతిమార్గమున నడిచేవారే కనిపించటం లేదు. ఎవరికివారు తమ వద్దకు వచ్చేటప్పటికి ఎంతటి అవినీతికైనా వెరవటం లేదు. కావల్సింది అధికారం. దానిని ఏదోవిధంగా సంపాదించటమే వారి పరమావధి.

ఏ పనిని సాధించాలన్నా సాధన ముఖ్యం. సాధన అనగానే 'ధ్యానం చేయటం, జపం చేయటం' అని భావిస్తుంటారు చాలామంది. అయితే భగవాన్ బాబావారు మాత్రం ఇవన్నీ సత్కర్మలు మాత్రమేనని చెబుతూ "చూచిన దానిని తలచటం, తలచిన దానిని చెప్పటం, చెప్పినదానిని చేయటం - ఇదే నిజమైన సాధన" అన్నారు. ఇది ఎంతో అనుభవపూర్వకమైన మాటలు, ఆచరణవాది చెప్పిన పలుకులు. వీటిని అనుసరించి ఆచరించటం మన అందరి కర్తవ్యం.

వ్యక్తి మంచివాడైతే సమాజం కూడా మంచిదవుతుంది. వ్యక్తి చక్కబడినప్పుడు, సమాజం కూడా చక్కబడుతుంది. వ్యక్తి క్షేమంగా ఉండినప్పుడే సమాజం కూడా క్షేమంగా ఉంటుంది. అసలు మానవునిలో చెడ్డ ఆలోచనలకుగాని, మంచి ఆలోచనలకు గాని మూలం దృష్టియే అంటూ "దృష్టి ఎట్టిదో సృష్టి అట్టిది" అన్నారు బాబా. కనుక మానవుడు మొట్టమొదట తన దృష్టిని పవిత్రమైన దానిగా రూపొందించుకోవాలని కోరారు. అప్పుడే పవిత్రమైన భావములు ఆవిర్భవించి, పవిత్రమైన వాక్కులు వెలువడు తాయంటూ ఈ మూడింటి యొక్క ఏకత్వంచేతనే మానవత్వం సార్ధకమవుతుందని పేర్కొనినారు. మంచి జీవనానికి మూలం పవిత్రమైన దృష్టి, పవిత్రమైన భావములు, పవిత్రమైన వాక్కులు, పవిత్రమైన కర్మలు, పవిత్రమైన సాధనలు అత్యవసరములని బోధించారు బాబా.

శ్రీ సత్యసాయిబాబావారి ఆలోచవాసరళిని ఆచరణలోపెడితే యావత్ ప్రపంచం సుఖశాంతులతో విలసిల్లుతుంది. ఏ సమాజం బాగుపడాలనినా, మొట్టమొదట వ్యక్తి సంస్కరించబడాలి, సచ్ఛీలవంతుడు (Good Character) కావాలి. అయితే ఈనాటి సమాజంలో గుణమునకు (Character) ప్రాధాన్యత ఇవ్వటంలేదు. ధనమునకు మాత్రమే రానురానూ ప్రాధాన్యత పెరుగుతున్నది. ఇది ఆరోగ్యం కాదు. ధనం ప్రధానం కాదు, గుణం ప్రధానం కావాలి. 'ధనమూలం ఇదం జగత్' కారాదు. ధర్మ మూలం ఇదం జగత్ కావాలి. దయామూలం ఇదం జగత్ స్థాయికి ఎదగాలి. అప్పుడే విశ్వశాంతి చేకూరుతుంది. యావన్మంది సుఖంగా సహజీవనం గడుపగలుగుతారు. చెప్పిన విషయాలను ఆచరణలో పెట్టండి! ఆచరణలో పెట్టిన విషయాలనే చెప్పండి!

- కొమరగిరి కృష్ణమోహనరావు

మార్చి 1998
సంపుటి 14 సంచిక 3

మేనేజర్
**కొమరగిరి చంద్రశేఖర్**
24-52, రామానాయుడుపేట,
మచిలీపట్నం - 521 001.
✆ 22818, 21137

Cheques & Drafts should be drawn in favour of ***"SREEVANI"*** Monthly Machilipatnam

Edited, Printed and Published by
***Komaragiri Krishna Mohan Rao***

| | | |
|---|---|---|
| సాధారణ సంచిక | : | 5-00 |
| సంవత్సర చందా | : | 60-00 |
| 4సం॥ల చందా | : | 225-00 |
| జీవిత సభ్యత్వం | : | 600-00 |
| పోషకులు | : | 1,116-00 |
| రాజపోషకులు | : | 5,116-00 |
| మహారాజపోషకులు | : | 10,116-00 |
| ఓవర్‌సీస్ చందా (4 సం॥లకు) | : | 50 $ |

Printed at
***SREEVANI OFFSET PRINTERS***
Machilipatnam

Despatched on
**7-3-1998**

# శ్రీవాణి
## సాంస్కృతిక మాసపత్రిక

సంపాదకులు : కొమరగిరి కృష్ణమోహనరావు

## విషయసూచిక



ముఖచిత్రం : **మహా సాత్వికుడు సాధువాస్వానీ**

# అమృత వాణి

శ్లో. వ్యాఘ్రః సేవతికాననం సుగహనం,సింహో గుహాం సేవతే
హంస స్సేవతి పద్మినీం వికసితాం,గృధ్రఃస్మశాన స్థలీం!
సాధుస్సేవతి సాధుమేవ సతతం నీచో2పి నీచం జనః
యా యస్యప్రకృతిః స్వభావ జనితా కేనాపి నత్యజ్యతే!!

'పుట్టుకతో పుట్టిన బుద్ధి పుడకలతోగాని పోదు' అనే సామెత మనకందరికీ తెలుసు. మంచిగాని, చెడుగాని ఏదైనా కావచ్చు అది సహజమైనపుడు దాన్ని వదిలించు కోవటం తేలిక కాదు. ఏ ప్రాణి విషయంలోనైనా యింతే. భూమిపై తిరిగే ప్రాణులు నీళ్ళలో మనలేవు. నీటిలో జీవించేవి భూమి మీద బ్రతకలేవు. కొన్ని భూమి మీద, నీటిలోనూ కూడా జీవిస్తాయి. అది ఆయా ప్రాణుల సహజ జీవనం.

ఇలాంటి వాటిని తెచ్చి కృత్రిమ వాతావరణంలో పెట్టితే, అది వాటికి విరుద్ధమై వాటి మనుగడకే ముప్పు వాటిల్లుతుంది. స్వేచ్ఛగా బ్రతుకలేవు. అప్పుడు వాటికీ, వాటి వల్ల ఇతర ప్రాణులకు ఇబ్బంది కలుగుతుంది. అది వాటి ప్రకృతి . పెద్దపులి దట్టమైన అడవిలోనే హాయిగా ఉండగలుగుతుంది. సింహం ఎప్పుడూ గుహల్లోనే ఉంటుంది. చక్కగా వికసించిన పద్మాల్లోనే తిరుగుతుంది హంస. గ్రద్ద చూడండి ఎక్కువగా స్మశానభూముల్లోనే వాలుతూ ఉంటుంది. ఇది వీటికి నైజ ప్రకృతి. వాటికి పుట్టుకతోనే వచ్చిన స్వభావం.

అడవుల్లోంచి తెచ్చిన పెద్దపులిని గ్రామాల్లో తిరగమంటే ఎలా ఉంటుంది?అందరినీ చంపుకొని తింటుంది. లేకపోతే చివరికి దాన్నే తుపాకితో కాల్చి చంపాలి. దానివల్ల గ్రామానికి, గ్రామీణుల వల్ల దానికి ముప్పేకదా!అంటే అది స్వేచ్ఛగా బ్రతకలేదన్నమాట. సింహమైనా అంతే.

ఈ క్రూర జంతువుల్ని సర్కస్ వాళ్ళు పట్టి బోనులో పెట్టి సమయం వచ్చినపుడు బయటకు తీసి ఆడిస్తారు కదా! అంటే ఆడిస్తారు. ప్రాణాలు అరచేతిలో పెట్టుకొని. తిండి తిన్నగా పెట్టక వాటిని మాడ్చి కొంతవరకు లొంగదీసుకుంటారు. అలా అని అవి వాటి క్రౌర్యాన్ని వదిలి పెట్టవు. ఎప్పుడెప్పుడు మనుష్యుల్ని మింగేద్దామా అని చూస్తూంటాయి. ఎంత మచ్చిక చేసినా వాటి స్వభావం పోదు.

**కూచిభట్ల చంద్రశేఖర శర్మ**

పద్మవనంలో స్వేచ్ఛగా తిరిగే హంసను మన పూలతోటలో పెడితే సుఖంగా ఉంటుందా? దానికెప్పుడు పద్మాల వాసన,వాటి తూడులు కావాలి. దాని స్వభావం అది. శ్మశానంలో శవాలు దొరుకుతాయి. వాటిని పీక్కుతినే గ్రద్ద అక్కడే ఉండటానికిష్టపడుతుంది గాని ద్రాక్షపళ్ళు పెడతామంటే పంజరంలో ఉంటుందా?అది వాటి వాటి ప్రకృతి సిద్ధమైన గుణం.

ఇదే విధంగా మనుష్యుల్లో కూడా రెండు రకాల వారున్నారు. వాళ్ళే సాధు జనులు, నీచ జనులు. వీళ్ళ స్వభావం పరస్పర విరుద్ధం.

సాధు జనులు ఎప్పుడు చూచినా సాధు పురుషులతోనే కలిసి జీవించటానికి ఇష్టపడతారు. నీచులెప్పుడూ తమలాంటి నీచుల సహవాసమే కోరుకుంటారు. మంచి చెడులకు సర్వదా చుక్కెదురే.

సాధు నీచ జనుల స్వభావం పరస్పర విరుద్ధం కావటంచేత కలిసిఉంటే సుఖం కలుగదు. దుఃఖమే కలుగుతుంది. ముత్యాలన్నీ ఒకచోట, నత్తగుల్లలన్నీ ఒకచోట ఉంటాయంటారు. పుట్టుకతో వచ్చిన స్వభావం ఎంత వదిలించుకొందామన్నా వదలదు.

"ప్రకృతిఃదుస్త్యజానామ" అని నానుడి. ఉల్లి పువ్వు ఉల్లిపువ్వే మల్లిపువ్వు మల్లిపువ్వే. ☆

# మహా సాత్వికుడు
# సాధు వాస్వానీ

పరమ సాత్వికుడు టి.యల్. వాస్వానీ, నవంబరు 27, 1879వ సంవత్సరం, హైదరాబాద్ సింధ్‌లో జమీందారు కుటుంబంలో జన్మించాడు. జాతకంలో గురువు ప్రాబల్యం అధికంగా ఉన్నదని తల్లిదండ్రులకు బ్రాహ్మణ పండితుడు చెప్పాడు. అందువలననే కాబోలు ప్రపంచానికి యావత్తు ప్రేమ, దయ, భక్తి విషయములను గూర్చి తన ఉపన్యాసముల ద్వారా, తన రచనల ద్వారా, గేయముల ద్వారా తెలియజెప్పి జనవరి 16, 1966వ సంవత్సరం, నిండు జీవితం గడిపి తన 87వ ఏట బ్రహ్మైక్యం పొందిన సాత్విక సంపన్నుడు సాధు వాస్వానీ.

వాస్వానీ తల్లి వారణదేవి, తండ్రి లీలారాం. వాస్వానీ పర్షియన్ భాషలో ప్రవీణుడు. జమీందారు వంశంలో జన్మించిన కారణంగా దేహబలానికి మాంసాహారం యుక్తమని ఆ కుటుంబం భావించేవారు. ఒకనాడు మాంసవిక్రయశాల వద్ద రక్తాన్ని చూచి, జంతు హింసను చూచి ఆ చిన్నవాడు మాంసాహారం భుజించనని తల్లితో చెప్తాడు. తల్లి తన బిడ్డ బలహీనుడవుతాడని భయపడి ఒక రోజున మాంసం తెలియకుండా ఇతర పదార్థాలతో వండి పెట్టింది. చిన్న బొమిక వాస్వానీకి కంటబడింది. తన దీక్ష భంగమైనదని కన్నీరుపెట్టి భోరున విలపించసాగాడు. తల్లి బాధపడి తానెప్పుడూ ఆ పని చేయనని బిడ్డతో చెప్పి స్వాంతన పరిచింది. అట్టి దీక్షాపరుడు, ఆజన్మ బ్రహ్మచారి సాధువాస్వానీ.

సింధ్‌లో హైస్కూలు విద్య ముగించి 17 ఏళ్ళ వయస్సులో కరాచీలో కాలేజీ విద్య ప్రారంభించాడు. ఆ కాలేజీ ప్రిన్సిపాల్ ఆంగ్లేయుడు హాస్కెట్. ఆయన ఒకనాడు క్లాసులో విద్యార్థులను 'ఆంగ్లేయుల పరిపాలన' అనే అంశం మీద ఒక వ్యాసం వ్రాసి మరునాడు క్లాసుకు తీసుకొని రమ్మన్నాడు. వాస్వానీ అలాగే తన వ్యాసాన్ని ప్రిన్సిపల్ హాస్కెత్‌కు ఇచ్చాడు. అది చదివి హాస్కెత్ అనుమానపడి "ఇది నీవు వ్రాసినది కాదు. ఎక్కడినుంచో కాపీకొట్టి తెచ్చావు. ఈ శైలి అనీబిసెంటు రచనవలె ఎంతో పటిష్ఠంగా ఉంది ఇది. నిజం చెప్పు. నీవు వ్రాసినదేనా?" అని నిలదీసి అడిగాడు. వాస్వానీ ఆ వ్యాసం తాను వ్రాసిన దేనని నిజం చెప్పాడు. "అయితే మరల నా ముందు వ్రాసి చూపు" అని అడిగి మరల వ్రాయించాడు హాస్కెత్. 17ఏళ్ళ విద్యార్థి చక్కని పటిష్ఠమైన ఆంగ్ల భాషలో కేవలం

## డా॥ రాపర్ల జనార్దనరావు

ఒక ఆంగ్లేయ ప్రిన్సిపల్‌ను ఆశ్చర్యచకితుని చేశాడు. సాధు వాస్వానీ భావి రచనలలో అన్నింటిలోనూ ఇదే విధమైన పల్లవించిన మధుర ఆంగ్లభాషా శైలి గోచరిస్తుంది. "కృష్ణుని మురళి గేయాలు" ఆయన ఆంగ్లంలో వ్రాసినవి, జయ దేవుని అష్టపదులు లాగా ఉంటవి. ఆయన రచనలు 125 ఏళ్ళు బ్రతికిన మహర్షి కార్వె, రాధాకృష్ణ పండితుడు, తత్త్వవేత్త T.M.P. Mahadven, ఇంకను అనేక మంది పాశ్చాత్యులను ఆకట్టుకొన్నవి. 'East and West', 'Rishi' మొదలైన రచనలు ఎంతో భావావేశం కలిగి చదువరులకు స్ఫూర్తినిచ్చును.

1902లో యం.ఏ. ప్యాసయి కలకత్తా మెట్రోపాలిటన్ కాలేజిలో హిస్టరీ ఫిలాసఫీ ప్రొఫెసర్‌గా కొన్నాళ్ళు తల్లి ఒత్తిడి వలన ఉద్యోగం చేస్తాడు. బిడ్డ ఉద్యోగవస్థుడైనాడు కదాయని తల్లి వారణదేవి సంతోషించింది. అచ్చట బ్రహ్మ సమాజ ప్రభావితుడు అవుతాడు వాస్వానీ. అందరూ ఆయనను 'ప్రొఫెసర్' అని సంబోధిస్తుంటే, వాస్వానీ "నన్ను 'ప్రొఫెసర్' అనవద్దు. నేనొక అన్వేషకునిగా వచ్చిన యాత్రికుడను. నన్ను 'యాత్రి' అనండి. 'I am a Seeker' అన్నాడు. సెలవల్లో తల్లి వద్దకు వచ్చి తాను 'ఫకీర్' అవాలని ఉంది అని తెల్పుతాడు. తల్లి వాస్వానీని ఎలాగైనా వివాహానికి ఒప్పించేందుకు ఎన్నో ప్రయత్నాలు ఇతరులతో చెప్పించి చూచింది కాని ఫలితం లేకపోయింది. జన్మతః సాత్విక సంపన్నుడుగ, కారణ జన్మునిగ జన్మించిన వాస్వానీ, [illegible] విషయ

సంగుడెట్లగును? కలకత్తాలో దక్షిణేశ్వరాలయ భక్తుడు రామకృష్ణ పరమహంస, వివేకానంద, బ్రహ్మ సమాజ ప్రవక్త కేశవ చంద్ర సేనుల గూర్చి విన్నాడు కాని ఆనాటికి వారు పరమపదించినారు.

కేశవ చంద్రసేన్ అన్న కొడుకు ప్రమోదలాల్‌సేన్ మాంచెస్టర్‌లో యం.ఎ. ప్యాసయి ఇండియాకి వచ్చి కలకత్తాలో ఉపన్యాసాలు ఇస్తుంటే ప్రొఫెసర్ వాస్వానీ శ్రద్ధగా విని ఆనందించేవాడు. ప్రమోదలాల్ సేన్ వాస్వానీ కళ్ళలోని తేజస్సును చూచి అతనిని తన శిష్యునిగ చేసుకొన దలచాడు. 'రేపు నీకొక చక్కని నామకరణం చేస్తాను రా' అని వాస్వానీతో చెప్తాడు. వాస్వానీ ఆసక్తితో మరునాడు వెళ్ళితే "నీ పేరు అజ్ఞాని (భోకా) అన్నాడు. వాస్వానీకి అర్ధమైంది. తన అన్వేషణ ఇంకా చాలా ఉంది' అని భావించాడు. ఒక దినము నిశ్శబ్దంగా కూర్చుని 'నేనెవరిని' అని ప్రశ్నించుకున్నాడు. అతనిలో జ్యోతి వెలిగింది. ఆనాటి నుండి 'ప్రొఫెసర్ వాస్వానీ', 'సాధు వాస్వానీ' అయినాడు.

వాస్వానీకి అప్పుడు 30 ఏళ్ళు. బెర్లిన్‌లో ప్రపంచ మతముల సభకు రమ్మనమని 1910లో ఆహ్వానం వచ్చింది. ఓడలో వెళ్ళాడు. సముద్రం అంటే వాస్వానీకి ఎంతో ప్రీతి. ఆ దేశాల సందర్శనం ఆతనికెంతో ఆనందాన్నిచ్చింది.

"Wherever I look, I do be hold
The beauty of his face untold
The music of His name I hear
In every nook it ringeth clear"

నేనెటుచూచినా ఆ దేవుని సౌందర్యం కన్పిస్తుంది. నేనేది వినినా ఆయన సంగీతం దశదిశలా మార్మోగుతుంది. అని సాధు వాస్వానీ పద్యం వ్రాశాడు. సాధువాస్వానీ జీవిత విశేషం తెలిసికొనవలెనంటే ఆయన రచించిన ఈ ఒక్క చిన్న గేయం చాలును. ఓడలో సముద్రం మీద ప్రయాణం చేస్తూ What is the message of the sea? Is it not be message of shakti? "సముద్రం మనకిచ్చే సందేశం ఏమిటి? అది 'శక్తి' సందేశం కాదా? అంటాడు వాస్వానీ. అందువలననే బెర్లిన్, ఇంగ్లండ్, ఇటలీ మొ॥ విదేశ యాత్ర ముగించి స్వదేశానికి వచ్చిన కొంత కాలానికి సాధూ వాస్వానీ "శక్తి ఆశ్రమం" స్థాపించాడు. దీన భావాలు, అశక్తి భావాలు కాకుండ, స్వామి వివేకానందుని వలె శక్తి సంపన్నతకు త్రోవ దీసే మార్గాలను చేపట్టాడు సాధు వాస్వానీ. "In all my work, may I come nearer to Thee, O Lord of Life" నేను చేయు ప్రతి పని వలననూ నీ చెంతకు మరింత సన్నిహితముగ చేయుము నా జీవంపు దేవా?" అని ప్రార్థిస్తాడు కార్యశీలి, దైవభక్తుడు వాస్వానీ. బ్రిటిష్ వారికి జర్మన్ వారికి గల పరస్పర విభేదములు తొలగవలెనని "Is not the world's piteous need a movement of reconciliation? నేటి ప్రపంచమునకు అత్యంతావశ్యకమైన విషయము మానవజాతిని అంతయు కలయిక చేయుటయే కదా? అని విశ్వమానవ భావమును ప్రబోధిస్తారు. "India - the India of Rishis - is my dream by day and my vision by night". ఋషి సంతతి కలిగిన (ఋషి భావములు కల్గిన) భారతదేశమునకై నేను రాత్రింబవళ్ళు కలలు కంటున్నాను. (ఆశించు చున్నాను) అని వాస్వానీ భారతదేశపు ఔన్నత్యమునకు మోకరించినాడు.

కలకత్తా కాలేజీలో 8 సంవత్సరములు ప్రొఫెసర్‌గా పని చేసి దయాల్‌సింగ్ కాలేజీ లాహోరు కమిటీ వారి ఆహ్వానము మీద పెద్ద కాలేజీ ప్రిన్సిపల్‌గా వాస్వానీ చేరతారు. ఇది తన తల్లికి చేరువగ ఉండవలెనన్నది వాస్వానీ భావన తల్లి కోర్కెయైన వివాహమునకు తానెట్లును అంగీకరించలేనందున ఈ విధముగ ఆమెకు ఆనందము చేకూర్చవలెనని తలచినాడు. కాని ఆతని యందుగల వైరాగ్య బీజములు ఆధ్యాత్మిక తేజము ఎట్లు మరుగున పడగలదు?

తల్లి వారుణదేవి తన బిడ్డ ప్రిన్సిపాల్ ఉద్యోగము చేయుచున్నాడని లాహోరు వచ్చి వాస్వానీతో కొన్నాళ్ళు గడిపింది. ఒకరోజు తల్లి అబ్బాయీ, నా మంచము వదులైంది. ఎవరినైనా సేవకుణ్ణి పంపి లాగించు. అని అడిగింది. కాస్సేపు అయిన పిదప వాస్వానీయే తల్లి మంచం బిగించటం చూచి 'అదేమిటి నాయనా ఎవరైనా సేవకునికి అప్పగించమన్నాను గాని నిన్ను చేయమన్నానా' అని అడిగింది. వాస్వానీ 'అమ్మా నేను నీ సేవకుణ్ణి కాదా? అన్నాడు. దేశ విదేశాలలో ఉపన్యాసాలు ఇచ్చి పేరు ప్రతిష్టలు

పొంది ప్రిన్సిపాల్ పదవి నిర్వహించుచున్న వాస్వానికి తల్లి గల ఆదరాభిమానాలు ఎంత గొప్పవి?

మహాత్మాగాంధీజీ, వాస్వాని అనేక మారులు ఒకరిని ఒకరు కలుసుకున్నారు. 1920లో గాంధీజీ సత్యాగ్రహం ఉద్యమంలోవాస్వానీ అనేక చోట్ల ప్రసంగించారు. వాస్వానీ రచనలు ఎంతో ప్రాముఖ్యం పొందేవి. మద్రాసులో ప్రఖ్యాతమైన ముద్రణా వ్యవస్థ Ganesh & Company వాస్వానీ రచనలు అన్నింటిని ప్రచురించేవారు. (ఈ వ్యాసకర్త కాలేజీ రోజుల్లోఆ పుస్తకాలన్ని చదవటం జరిగింది.) కొన్ని పుస్తకాల్ని బ్రిటిష్ ప్రభుత్వం నిషేధించింది కూడా. ఆర్య సమాజ సిద్ధాంతాలపై నెలకొల్పబడి గురుకుల్, కాంగ్రీ కాన్వొకేషన్ సభలో గాంధీజీ,వాస్వానీ ఉపన్యసించారు. ఇచటనే గాంధీజి ఒకే ఒక వాక్యం " భారత్ కా సిపాహి బనో", "భారతదేశపు సిపాయివి నీవు కావాలి" అని చెప్పి ముగించారు.

తన పదవి త్యాగం చేసి సత్యాగ్రహ ఉద్యమంలో పాల్గొని సాధు వాస్వాని భారతదేశం అంతటా పర్యటించారు. ఆనాడు పాశ్చాత్యులకు భారతదేశపు రత్నములలో గాంధీజీ, ఠాగూరు, వాస్వానీ ముగ్గురే తెలిసినవారు. భారతదేశపు విభజన పిదప వాస్వానీ పూనాలో స్థిరపడి, స్త్రీ విద్యకై ఉద్యమం "మీరా ఎడ్యుకేషన్ సొసైటీ" ద్వారా సాగించారు. సాధు వాస్వానీ విశిష్టత "Supremacy of the Woman Soul" అనెడి భావన. భారతీయ విద్యాభవన్బీ వారు ప్రచురించిన సాధు వాస్వానీ జీవిత చరిత్ర ఎల్లరు చదువదగినది. ☀

## పదాల పందిరి - 9 సమాధానాలు

**అడ్డం : 1. కౌగిలి, 3. కమలం, 5. తోరణం, 7. దివి, 9. గాడి, 10. దేహి, 11. మేను, 12. ఊహ, 14. గజం, 16. జమానా, 18 లలల, 19. కందుకం**

**నిలువు : 1.కౌముది, 2. లితో, 3. కణం, 4. లంబాడి, 6. రచ్చ, 8. విదేహ, 9. గానుగ, 12. ఊయల, 13. బీమా, 15. జంబూకం, 16. జల, 17. నాకం.**

# పదాల పందిరి - 10



ఆధారాలు :

అడ్డం : 1.ప్రేమ, ఆప్యాయత, 3. మంచం, 5. రంగుల కలయిక, 7. సంహరించుట, 9. టోపీ వేయుట, 10. 'సరిగమ'ల్లో మొదలు, చివర లేవు, 11. 'తహతహ' తక్కువైతే? 12. సతీ అనసూయ పతి, 14. ఒకే 'నువ్వు', 16. గిఫ్ట్, 18. ప్రేమోత్సాహం, 19. బోధనకాదు, సెర్చ్

నిలువు : 1. ఇంగువ కాదు స్త్రీ !, 2. జనరేషన్, 3. నిబ్, 4. చివర విరిగిన పురస్కారం, 6. వెక్కిరించుట, 8. భూమి, 9. నారదుని వీణ, 12 'అతి' పొడిగిస్తే నారి, 13. స్వారీ కోనం గుఱ్ఱం మూపున ఉండేది, 15. 'నవల' తలక్రిందులైంది, 16. పంట, ఒక కులం పేరు, 17. శోకం ఎక్కువై పూర్ణం ఊడి తిరగబడింది.

**-కిరీటి**

రసవద్ఘట్టాలు - 34

# భగత్ సింగ్

*1931 మార్చి 3వ తేదీన, అతనిని చూడాలని బంధువులు, మిత్రులు జైలు వద్దకు వచ్చారు. అదే వారి చివరి దర్శనం. భగత్ సింగ్‌లో విప్లవ బీజాలను నాటిన అర్జున్ సింగ్, భగత్ సింగ్ తలనిమురుతూ మాట్లాడాలనుకొన్నారు. కాని ఉద్వేగంతో మాటలు పెగల్లేదు. కొంత దూరం వెళ్ళి కన్నీరు కార్చారు. ఈ దృశ్యాన్ని చూచిన భగత్ సింగ్ తల్లి మరియు అతని బంధువులు నిశ్చేష్టులయ్యారు. భగత్‌సింగ్ నిబ్బరంగా చూశారు. ప్రశాంత చిత్తంతో, "చూశారా, ఈ మధ్య నా బరువెంత పెరిగిందో" అంటూ చిరునవ్వుతో పలకరించారు. అదే భగత్ సింగ్ జీవితంలో చివరి రోజు, చివరిసారి దర్శనం అన్న వాస్తవం వారికి తెలుసు.*

*తన మాతృమూర్తితో మాట్లాడుతూ "అమ్మా, తాతగారు బాగా పెద్దవారయ్యారు. మీరు గ్రామానికి వెళ్ళి వారి బాగోగులు చూడండి," అన్నారు. ఒక్కొక్కరిని పలకరిస్తూ అందరికీ ధైర్యం చెప్పాడు.*

*"అమ్మా, మీరెవరూ, నా శవం కోసం ఇక్కడికి రాకండి. కుల వీరుణ్ణి సాగనంపిన, మీరు కన్నీరు కారిస్తే, చూచిన వారు భగత్ సింగ్ తల్లి కన్నీరు కారుస్తూంది అనుకుంటారు", అంటూ పెద్దగా నవ్వాడు. తెల్లారితే ఉరికంబమెక్కాల్సిన భగత్ సింగ్ ధైర్యాన్ని చూచి జైలు అధికారులు నివ్వెరపోయారు.*

- జానమద్ది హనుమచ్ఛాస్త్రి

రసవద్ఘట్టాలు - 35

# సుభాస్‌చంద్రబోస్

సుభాస్ చంద్రబోస్ ఇంగ్లండ్ లో ఐ.సి.యస్ పరీక్ష రాసి కలకత్తా చేరారు. మన దేశంలో మరో పరీక్ష రాయాల్సి వచ్చింది. పరీక్షలో ప్రశ్నాపత్రం చూశారు. చదువుకొని మండిపడినారు. ప్రశ్నాపత్రికలో అనువదించమని ఈ క్రింది వాక్యం ఉంది.

" Indian soldiers are Generally Dis-honest" (భారతీయ సైనికులు సాధారణంగా అవినీతి పరులు). అభ్యర్థులు ఆ వాక్యాన్ని తమ మాతృభాషలో అనువదించాల్సి ఉంది. అనువదించటానికిచ్చిన ప్రశ్నను ఆక్షేపిస్తూ, ప్రధాన పర్యవేక్షకులనుద్దేశించి మాట్లాడుతూ

"మీరీ ప్రశ్నను తొలగించండి" అన్నాడు.

" ప్రశ్న నిర్బంధంగా రాయాలి. లేకున్న మీరు పెద్ద ఉద్యోగం కోల్పోవలసి వస్తుంది."

ఈ సమాధానం విన్న సుభాస్‌బాబు తోక తొక్కిన త్రాచులా కళ్ళురుమారు. వెంటనే ప్రశ్న పత్రాన్ని ముక్కలుగా చించి వేశారు

"మీ ఉద్యోగం ఎవరికి కావాలి. నా మాతృభూమికి కళంకం ఆపాదిస్తూ, మా సైనికులను అవమానించే, వాక్యాన్ని అనువదించుట కంటే ఆకలితో మాడిపోవటానికి సిద్ధంగా ఉన్నాం. ఇటువంటి ఉద్యోగం నాకక్కరలేదు" అంటూ పరీక్షా కేంద్రం నుండి విసవిసా వెళ్ళిపోయారు.

- జానమద్ది హనుమచ్ఛాస్త్రి

- నూతన ఆంగ్ల సంవత్సర సందేశం



# మానవుడు జ్ఞాన ప్రకాశకుడు కావాలి లోక ప్రకాశకుడు కాదు.

"దైవాధీనం జగత్సర్వం
సత్యాధీనం తు దైవతం
తత్సత్యం ఉత్తమాధీనం
ఉత్తమం పరదేవతామ్"

ఈ జగత్తంతయునూ దైవాధీనమై ఉన్నది. అట్టి దైవము సత్యమునకు ఆధీనుడై ఉంటున్నాడు. అట్టి సత్యము ఉత్తమమైన, పవిత్రమైన పురుషునియందు ఆధీనమై ఉంటున్నది. ఈనాటి మానవుడు సత్య స్వరూపుడు కావాలి. సత్యమును ఆధీనము చేసుకోవాలి.

"సత్యంబునందుండే సర్వంబు సృష్టించె
సత్యంబునందుండె సర్వమణగె
సత్యమహిమలేని జగతి ఏది కనుగొన్న
శుద్ధ సత్యమదియె చూడరయ్యా".

ప్రతి మానవుడు సత్యము నుండియే ఆవిర్భవించాడు. సత్యములోనే జీవించుచున్నాడు, సత్యము నందే లయమవుతున్నాడు, తానే సత్యస్వరూపుడు. ఇట్టి సత్యమును ప్రతి వ్యక్తీ గుర్తించినప్పుడు జగత్తంతా స్వర్గముగా మారుతుంది. ఈనాడు మానవుడు కోరవలసింది సుఖము కాదు. తన గమ్యము దుఃఖము కాదు. సుఖదుఃఖములు రెండూ ఎక్కడ ఆవిర్భవించునో, దానిని మానవుడు స్వాధీనం చేసుకోవాలి. సుఖము కంటె మానవునికి జ్ఞానబోధ గావించునది దుఃఖమే. ఏ మహనీయుల చరిత్రలు చూచినప్పటికినీ దుఃఖము నుండే వారు ఉన్నత జ్ఞానమును సాధిస్తూ వచ్చారు. దుఃఖము లేకుండా మనకు జ్ఞానము లభ్యము కాదు. దుఃఖమే మానవునకు అమితమైన జ్ఞానమును బోధిస్తున్నది. ఈ సత్యమును మానవుడు గుర్తించుకొనలేక సుఖము... సుఖము... అని ఆశిస్తున్నాడు. సుఖము కూడానూ అవసరమే. ఎప్పుడు ఈ సుఖం మనకు ప్రాప్తిస్తుంది? దుఃఖమును సాధించినపుడే మనకు సుఖం లభ్యమవుతుంది. కనుక ప్రతి మానవుడు సుఖమును ఏవిధంగా స్వాగతం గావించుచున్నాడో, అదే రీతిగా దుఃఖమును కూడను స్వాగతం చేయాలి.

"కష్టసుఖములు రెండును కలిసియుండు
వీని విడదీయ నెవ్వరి తరము కాదు.
సుఖము ప్రత్యేకముగ నెందు చూడబోము
కష్టము ఫలించెనేని సుఖంబటండ్రు"

సుఖము ఎక్కడనుండి వస్తున్నది? దుఃఖమును, కష్టమును జయించినప్పుడే ఈ సుఖము మనకు ప్రాప్తిస్తుంది.

ఈనాడు లోకము యొక్క సౌభాగ్యమంతయూ యువకుల మీదనే ఆధారపడి ఉంటున్నది. కనుక మన యొక్క సౌభాగ్యము బాలబాలికలే. మానవుడు అనేక కష్టములలో అనేక అనుభూతులు పొందుతున్నాడు. జాగ్రత్త అవస్థయందు మానవుడు అనేక జగత్ సంబంధమైన సుఖములను అనుభవిస్తూ అనేక అనుభూతులను పొందుతున్నాడు. స్వప్నావస్థయందు తననుతాను సృజించు కొంటున్నాడు మానవుడు. అంతియే కాదు. తన కష్ట సుఖములను కూడా తానే కల్పించుకుంటున్నాడు. స్వప్నానుభూతిని తానే కల్పించుకొని అనుభవిస్తున్నాడు. నిద్రావస్థలో తనను తాను మరచి, విశ్వశాంతి లోపల లీనమై, ఆనందాన్ని అనుభవిస్తున్నాడు. జాగ్రత్త, స్వప్న, సుషుప్తులు - మూడు కూడనూ ఒకే వ్యక్తి యొక్క అనుభూతులే. కనుకనే మానవుని యొక్క జయాపజయములు, లాభ నష్టములు, సుఖదుఃఖములు అన్నీ కూడనూ కాలాను గుణ్యముగా అనుభవించేటటువంటివే.

భగవంతుని "సిద్ధి రూపాయనమః" అన్నారు. అనగా మానవుని యొక్క అభీష్టములు సిద్ధింపజేసేటటు వంటివాడు కనుకనే అతనిని 'సిద్ధ స్వరూపుడు' అన్నారు. 'అమోఘుడు' అని కూడా చెప్పారు. 'మోహము' అనగా పరిమితమైనటువంటిది. 'అమోఘము' అనగా అనంత మైనటువంటిది. కనుక భగవత్సంకల్పమనేది అమోఘమై

నటువంటిది, అనంతమైనటువంటిది, అప్రమాణమైనటు వంటిది కనుకనే అతనికి 'అప్రమాయనమః' అని పెట్టారు. ఏది మనకు సంభవించినా, అది భగవంతుని ప్రసాదము గానే మనం భావించాలి. సుఖదుఃఖములు రెండు కూడనూ భగవంతుని అనుగ్రహ ప్రసాదములుగానే మనం విశ్వసించాలి. అందులోనే మనకు ఆనందం ఉంటుంది. తాత్కాలికంగా అప్పుడప్పుడు కొన్ని అపజయాలు, కీడులు, నష్టాలు సంభవిస్తుంటాయి. కారణము లేని కార్యము జగత్తులో కానరాదు. అన్నము తినాలంటే ఆకలి కావాలి. నీరు త్రాగాలంటే దప్పిక కావాలి. దుఃఖము అనుభవించాలంటే కొన్ని కష్టములు సంభవించాలి. మానవుడు ఆనందాన్ని అనుభవించాలంటే, ఒక విధమైన సంతోషం ప్రాప్తించాలి. అన్నము లేక ఆకలి తీరదు, నీరు లేక దాహం తీరదు, కష్టము లేక సుఖము ప్రాప్తించదు. ప్రతిదానికి ఒక కారణం ఉంటుంది. అన్నింటికి మూల కారణము ప్రేమ. ప్రేమకు మించిన ధనము ఈ జగత్తులో కానరాదు. మానవుని యొక్క సుఖములు, సంతోషములు, ఆనందములు, సౌభాగ్యములు అన్నీ కూడనూ ఒక్క ప్రేమ ద్వారానే మనకు లభ్యమవుతాయి. ప్రేమలేకుండా దేనినీ మనం అందుకోలేం. కనుక మానవునికి ప్రధాన ధనం ప్రేమ ధనమే. ఇట్టి ప్రేమ ధనమును ప్రతి మానవుడూ సంపాదించాలి. ఇట్టి ప్రేమ ధనమును సంపాదించిన ప్రతి వ్యక్తీ నిరంతరం ఆనందమును అనుభవిస్తూనే ఉంటాడు.

## విదురనీతి

"అసూయైక పదం మృత్యోః
అతివాదః శ్రియో వధః
అశుశ్రుషా త్వరా శ్లాఘా
విద్యాయాః శత్రవస్త్రయంః"

అసూయ అనునది మృత్యువుకు ప్రధాన స్థానము. కఠోరముగా పలుకుట లక్ష్మిని నశింప జేయునది, పెద్దలను సేవింపకుండుట, లేక వినుటకు ఇష్టము లేకుండుట, తొందర, ఆత్మ స్తుతి -ఇవి మూడు విద్యకు శత్రువులు.

లోకములో మనం అనేక విధములైన కష్ట నష్టములను చూస్తుంటాం. కాని ఈ కష్టములు శాశ్వతంగా, నిరంతరం మన వెంట ఉండవు. కొంత కాలం తరువాత సుఖము కూడా మనకు ప్రాప్తిస్తుంటుంది. అనుభవించినందువలన ఆనందం పెరుగుతుందేగాని తరగదు. చెఱకు నమిలిన కొద్దీ మాధుర్యం అధికమవుతూ ఉంటుంది. బంగారమును కాల్చినకొద్దీ వన్నె పెరుగుతూనే ఉంటుంది. అదే విధముగా మానవుడు కష్టనష్టములకు గురియైనప్పుడే, అంతర్భూతమైనటువంటి దివ్యశక్తి ఆవిర్భవిస్తుంది. క్రొత్త సంవత్సరములు, క్రొత్త నెలలు మనకు ఆనందాన్ని గాని, దుఃఖాన్ని గాని, కష్టాన్నిగాని తీసుకొని రావటం లేదు. ప్రతి క్షణం కూడనూ క్రొత్తదే. ప్రతి సెకండ్ కూడనూ నూతనమైనదే. సెకండ్ లేక నిముషము రాదు, నిముషములు లేక గంటలు రావు, గంటలు లేక దినములు జరుగవు. దినములు లేక నెలలు రావు, నెలలు లేక సంవత్సరం కాదు. కాబట్టి ఈ సంవత్సరమంతయూ కూడనూ క్షణములతోనే ఆధారపడి ఉంటున్నది. ప్రతి క్షణం మనం పవిత్రమైనదిగా భావించి అనుభవించినప్పుడే, ఈ సంవత్సరం నూతన సంవత్సర మవుతుంది. ఒక్కొక్క క్షణము మనం ఎట్టి కార్యముల చేత, ఎట్టి ప్రవర్తనల చేత కాలం గడుపుతున్నామో దాని ఫలితమే మన సంవత్సర ఫలితం. ఉదాహరణకు ఒక పోస్ట్‌మేన్ ఉన్నాడు. ఎవరింటికి వచ్చిన ఉత్తరాలను వారికి యిస్తుంటాడు. పోస్టు వచ్చినప్పుడు ఒక ఇంటివారు గొల్లున ఏడుస్తారు, ప్రక్క ఇంటి వారు ఆనందంగా నవ్వుతారు. ఒకరు ఏడ్చుటకు, మరొకరు నవ్వుటకు పోస్ట్‌మాన్ కారణమా? కాదు...కాదు... ఆ లేఖలలో ఉన్న విషయములే నవ్వులకు, ఏడ్పులకు కారణము. అదే విధముగనే మానవుడు ఆచరించిన సుఖ దుఃఖములననుసరించియే పోస్ట్‌మేన్ వలె భగవంతుడు వారికి కవర్లను అందిస్తుంటాడు. కనుక మనం పవిత్రమైన, మంచిదైన, ఆనందమయమైన జీవితాన్ని అనుభవించాలంటే పవిత్రమైన మంచి కర్మలను ఆచరిస్తూ రావాలి. లోకములో మంచి మార్పు రావాలంటే మానవుడు మారినప్పుడే ఇది సాధ్యమవుతుంది. వ్యక్తి ప్రవర్తన సక్రమమైనది అయినప్పుడే సమాజం యొక్క

ప్రవర్తన సరియైనదిగా కనిపిస్తుంది. పిల్లలు పాడారు "సహనావవతు, సహనౌ భునక్తు" "మనందరం కలిసి మెలిసి మెలుగుదాం, కలిసి మెలిసి తిరుగుదాం, కలిసి మెలిసి తెలుసుకున్న తెలివిని పోషించుకుందాం' అన్నారు. " కలసి మెలసి కలత లేక చెలిమితో జీవించుదాం" అని వారు చెప్పలేదు. "కలిసి మెలసి చెలిమితో జీవించుదాం" అనేటటువంటి విషయం చాలా అవసరమైనటువంటిది. ఎప్పుడు ఈ చెలిమి మనకు ప్రాప్తిస్తుంది? కలతలు లేనప్పుడే చెలిమి మనకు కలుగుతుంది. కనుక ప్రతి మానవుడు కూడనూ ఎట్టి కలతలకు అవకాశం యివ్వకుండా, అశాంతికి హృదయాన్ని అందించకుండా, స్నేహంతో, ప్రేమతో జీవితాన్ని గడపటానికి ప్రయత్నించాలి. భగవంతుడు నిరంతరం ప్రేమ స్వరూపుడే. తన దివ్యప్రేమ చేతనే ప్రపంచం వ్యాప్తి చెందుతుంది.

విశ్+వ= విశ్వ. 'విశ్' అనగా జగత్తు. 'వ' అనగా ప్రవేశించటం. విశ్వములో ప్రవేశించినటువంటివాడే భగవంతుడు. అతను ప్రవేశించటం చేతనే దీనికి 'విశ్వం' అని పేరు వచ్చింది. విష్ణు: అనేదానిలో విష్, ష్ణు అనే రెండు పదములున్నాయి. విష్ అనగా జగత్. ష్ణు అనగా వ్యాపింపజేయటం. జగత్తంతా వ్యాపించినటువంటివాడు విష్ణువు కనుకనే 'విష్ణువు కారణ స్వరూపుడు 'విశ్వము' కార్య స్వరూపము. కార్య కారణ స్వరూపమే ఈ జగత్. విష్ణువు లేక విశ్వము లేదు, విశ్వము లేక విష్ణువు లేడు. ఈ రెండింటి యొక్క ఏకత్వమే ఈ జగత్. అందువలననే దీనికి 'ఆత్మ' అన్నారు.

'ఆత్మ' అనగా ఏమిటి? అదియే బ్రహ్మము అన్నారు. ఈ బ్రహ్మము అనేటటువంటివాడు ఎక్కడ నుంచి వచ్చాడు? విష్ణువు నాభినుండి అనగా కమలనాభి నుండి పుట్టినటువంటివాడే బ్రహ్మ. కనుక విష్ణుత్వమనేదే సర్వవ్యాపకమైనది. కనుకనే ఇతనికి 'ఆత్మ:' అన్నారు. ఆత్మ: అనగా పగలు అని అర్థము. అంధకారము దూరము గావించునటువంటిదే ఈ పగటి దినము. మన చీకటిని దూరం చేసి, వెలుగును అందించి, ప్రతి పదార్థము యొక్క స్వస్వరూపాన్ని గుర్తింపజేసేటటువంటిది వేదము. కనుక 'విష్ణువు''అనగా ఏమిటి? వేదములను అందించి 'తమసోమాజ్యోతిర్గమయా'. ఈ తమస్సు నుండి జ్యోతిని అందించేటటువంటివాడు విష్ణువు. ఇలాంటి దివ్యమైన భావములు భారతీయ సంస్కృతి యందు అనేకం కనిపిస్తున్నాయి. కాని ఇట్టి పవిత్రమైన భారతీయ సంస్కృతిని ఎవరూ గుర్తించడటానికి గాని, గుర్తించాలనే ఆశగాని కలగటం లేదు. ఈనాడు చాలామంది భగవంతుని పూజించడం, జపించడం, ధ్యానించడములే ప్రధానమైన లక్ష్యముగా భావిస్తున్నారు. ఈ పూజలు, జపములు, ధ్యానములు దేని నిమిత్తమై చేస్తున్నామనే సత్యాన్ని గుర్తించుకోలేకపోతున్నారు. తమ గమ్యమేమిటో తాము గుర్తించుకోలేకపోతున్నారు. గమ్యమును గుర్తించుకోక, గమ్యమును తెలుసుకోక ఎన్ని చేసినా వ్యర్థమే అయిపోతాయి. అన్నింటి యొక్క గమ్యం ప్రేమతత్త్వము ఒక్కటే. ప్రేమను సాధించాలి. అప్పుడే మన సాధన యొక్క ఫలితం మనకు రూపొందుతుంది. ఎట్టి పరిస్థితుల యందు మనం ప్రేమను ఏ మాత్రం వదలకూడదు. ప్రేమను మార్చుకోకూడదు. కష్టసమయములయందు కూడనూ మనం ప్రేమను అనుభవించాలి. ప్రేమ ఉన్నచోట ద్వేషమనేది కలుగదు. ప్రేమ ఉన్నచోట కష్టమనేది సంభవించదు. ప్రేమ ఉన్నచోట దుఃఖమనేది ప్రవేశించదు. కనుక ఇట్టి పవిత్రమైన ప్రేమ తత్త్వాన్ని మనం గుర్తించుకొని వర్తించాలి. కనుక సర్వ సాధనల యొక్క మూలము, సర్వసాధనల యొక్క గమ్యము, సర్వసాధనల యొక్క లక్ష్యము ప్రేమ ఒక్కటే. ఇట్టి ప్రేమతత్త్వాన్ని మానవుడు

## యక్ష ప్రశ్నలకు సమాధానాలు

"విద్యమానే ధనే లోభాత్
దాన భోగ వివర్జిత:
ప్రశ్చాన్నాస్తీతి యో బ్రూయాత్
సో2 క్షయం నరకం వ్రజేత్"

ధనమున్నా ఎవడు లోభం చేత, దానం చేయుక, తాను అనుభవింపక, ఆశ్రయించిన వాళ్ళకు లేదని చెబుతాడో, అతడు తరగని నరకాన్ని అనుభవిస్తాడు.

అభివృద్ధి వరచుకోవాలి. అప్పుడే మానవత్వం సార్థకమవుతుంది.

మనం ఎన్నియో సంవత్సరాలు గడుపుతున్నాము. మన వయస్సు పెరుగుతున్నది. కాని భావం తరుగుతున్నది. భావం పెరగటం లేదు. భావం పెరగాలి. భావశుద్ధియే జ్ఞానశుద్ధి. భావ శుద్ధి లేక జ్ఞాన శుద్ధి మనకు లభ్యము కాదు. "జ్ఞానాదేవతుకైవల్యమ్" అట్టి జ్ఞానమును అనుభవించినప్పుడే మనకు కైవల్యం ప్రాప్తిస్తుంది. ప్రపంచంలో మానవులు ఎన్నో రీతులుగా ధనమును ఆర్జిస్తున్నారు. పేరు ప్రతిష్ఠలను పెంచు కుంటున్నారు. కీర్తి మర్యాదలను అందుకుంటున్నారు. గొప్ప శ్రీమంతులుగా చలామణి అవుతున్నారు. ఎంత శ్రీమంతుడైనప్పటికినీ, తన జీవితగమ్యమేమిటి? అని ప్రశ్నిస్తే, ఏమాత్రం తెలియని స్థితిలోనే ఉన్నాడు. దీనికి కారణమేమిటి? అనేకత్వంలోని ఏకత్వాన్ని పరిశీలన చేయక, ఏకత్వాన్ని అనేకత్వంగా భిన్నం చేస్తున్నారు. అనేకత్వాన్ని ఏకత్వంగా చేసే మహనీయులు బహుతక్కువ. ఏకత్వాన్ని అనేకత్వంగా విభజించే మహానుభావులు మాత్రం ఎక్కువ. అదియే ఈనాటి వారి గొప్పతనం. కాని అనేకత్వాన్ని ఏకత్వంగా విశ్వసించటమే మంచితనం.

అసలు మంచితనానికి గొప్పతనానికి ఉన్న వ్యత్యాసమేమిటి? ప్రతి మానవునియందు దైవత్వాన్ని దర్శించటమే మంచితనం. దైవమునందు మానవత్వాన్ని నిరూపించటమే గొప్పతనం. "ఎందెందు వెతికి చూచినా అందందే కలడు భగవంతుడు" అన్నాడు ప్రహ్లాదుడు. అది మంచితనం. కాని విశ్వమంతయూ మానవత్వమే గాని, దైవత్వములేదు అని భిన్నంగా చెప్పినటువంటివాడు హిరణ్యకశిపుడు. అనగా దైవమునందు కూడా మానవత్వాన్ని నిరూపిస్తూ వచ్చాడు హిరణ్యకశిపుడు. కనుక హిరణ్యకశిపుడు గొప్పవాడైనాడు. ప్రతి మానవుని యందు దైవత్వాన్ని నిరూపించినటువంటివాడు ప్రహ్లాదుడు. ఇతను మంచివాడైనాడు. కనుక మనం ఈలోకంలో సాధించవలసినది ఏమిటి? మంచితనాన్ని సాధించాలి, గొప్పతనము కాదు. "నా కొడుకు గొప్పవాడు కావాలి, గొప్ప అధికారి కావాలి, గొప్ప విద్యావంతుడు కావాలి, గొప్ప శ్రీమంతుడు కావాలి" అని కోరడం చాలా పొరపాటు. "నా కొడుకు మంచివాడు, మంచిపేరు సంపాదించాలి. మంచి కీర్తిని పొందాలి, సమాజంలో మంచి పేరు తెచ్చుకోవాలి" అని కోరుకోవాలి. ఆ మంచితనములో ఉండినటువంటి మంచితనం ఎంత గొప్పగా ఉంటుందో - అదే ప్రేమ యొక్క లక్ష్యము.

రాముడు ఎన్ని విద్యలు నేర్చాడో, రావణుడు యింకా అంతకంటే ఎక్కువ విద్యలనే నేర్చాడు. కాని తాను నేర్చిన విద్యలన్నీ సార్థకం చేసుకోలేకపోయినాడు రావణుడు. నేర్చిన విద్యలను జీర్ణించుకోలేకపోయాడు. జీర్ణించుకోలేకపోవటంచేత ఆ విద్యలన్నీ అజీర్ణరోగంగా రూపొందాయి. కనుకనే దుర్గుణములను అనుభవిస్తూ వచ్చాడు. కాని సాధించిన విద్యలను సత్కర్మల లోపల ప్రవేశపెట్టాడు రాముడు. సత్కర్మలకు అంకితం చేశాడు. మంచితనమును జీర్ణించుకున్నాడు. కనుకనే లోకకీర్తిని పొందాడు. అందువలననే "రామో విగ్రహవాన్ ధర్మః" అన్నారు ఋషులు. ధర్మస్వరూపము రామ తత్త్వము. కనుక ప్రతిమాట, ప్రతి పని, ప్రతి విషయం మంచిమార్గంలో ప్రవేశపెట్టాలి. ఈనాటి విద్యార్థులు, యువకులు పవిత్రమైన మార్గంలో ప్రవేశించాలి. "సర్వలోకహితే రతాః" అన్నారు. లోక క్షేమాన్ని మొదట మనం కోరాలి. ఇది మొదటి గుణము. "సర్వే గుణైక సంపన్నః" ఉత్తమ గుణములను సంపాదించాలి. ఇది రెండవ గుణము. "సర్వే జ్ఞానైక సంపన్నః" ఇది మూడవది. అన్ని విధములైన జ్ఞానములను మనం సంపాదించాలి. లోకహితాన్ని కోరడం, సద్గుణములను సంపాదించడం, సర్వ జ్ఞానములను సాధించడం. - ఈ మూడే మానవుని ప్రధాన లక్ష్యములు. ఈ మూడింటిని సాధించినటువంటివాడు ముల్లోకములను సాధించగలడు. దైవమునకు ఈ మూడు గుణములతో కూడిన హృదయాన్ని మాత్రమే అర్పితం చేయాలి. ఈ మూడింటితో జగత్తులో మనం జీవించాలి. ఈ మూడింటికి ప్రేమయే మూలాధారము. ఇట్టి ప్రేమతత్త్వమును విస్మరిస్తే, మనం దేనినీ సాధించలేం.

**ప్రేమస్వరూపులారా!**

ప్రతి మానవుడు ప్రేమమయుడే, కాని తన

అభీష్టము నెరవేరినప్పుడు ఆ ప్రేమను పెంచుకుంటాడు. తన అభీష్టము చెల్లనప్పుడు ఆ ప్రేమను చాలా క్రుంగింప జేసుకుంటాడు. ఇది సరియైన సాధన కాదు.

**"కోరిక తీరినవేళ నను గొప్పగ పొగడెదరోయి**
**కోరిక తీరకపోతే నను ఊరక తెగతిడుదురోయి**
**పాపంబౌ పనిచేసి ఫలమాపద కలిగిన రోసి**
**కాపాడవు నీవనుచు కీడు నాపై ఆల్లెదరోయి."**

చేసేది పాపమైన పని, కాని కోరేది మంచి ఫలము. చేదు విత్తనములు నాటి తీపి ఫలములు రావాలంటే వస్తాయా? తీయని ఫలములు కావాలనుకున్నప్పుడు తీయని విత్తనములే నాటాలి. అప్పుడు తీయని ఫలములు లభ్యమవుతాయి. కనుక ప్రపంచములో మనము మాధుర్యమైన జీవితమును అనుభవించాలంటే, పవిత్రమైన కర్మలలో మనం ప్రవేశించాలి. లోక సంబంధమైన కర్మలు తాత్కాలిక ఆనందమును చేకూరుస్తాయి. కాని నిత్యసత్యమైన ఆనందం ఒక్క దైవ ప్రేమద్వారానే మనకు లభ్యమవుతుంది. దైవ ప్రేమను అభివృద్ధి పరచుకోవాలి. అట్టి దైవప్రేమను పొందడానికి తగిన కృషి చేయాలి. లోక సంబంధమైన ప్రేమమాలిన్యాన్ని కలిగింపజేస్తుంది. తద్వారా జగత్తంతా మాలిన్యంగా రూపొందుతుంది. ఎందుకనగా తన భావము ఈ లోకమాలిన్యమైన దృష్టిగా ఉండటం చేత, ఆ దృష్టికి సంబంధించినదంతా కూడనూ మాలిన్య దృష్టిగానే రూపొందుతుంది. మానవుడు ఎట్టి రంగుల అద్దాలు పెట్టుకుంటాడో, జగత్తంతా అదే రంగులో కనిపిస్తుంది. కనుక ప్రతి మానవుడూ ప్రేమ నేత్రాన్ని పెట్టుకోవాలి. సర్వమునూ సమానత్వంగా మనం చూడాలనుకుంటే, ప్రేమ అనే సమత్వాన్ని మనం వహించినప్పుడు సర్వమూ సమత్వంగా గోచరిస్తుంది. ద్వేషము, అసూయలకు మనం ఎన్నడూ అవకాశం యివ్వకూడదు. ఆహార విహారములవలన ఇలాంటివి కొన్ని మనలో ప్రవేశిస్తుంటయి. ఎటువంటి పరిస్థితులలోను ఇలాంటి దుర్గుణములకు అవకాశం యివ్వకూడదు.

ఈనాడు 1998 సంవత్సరం ప్రారంభమైంది. ఈనాటినుండి అయినా మీ హృదయాలను ప్రేమమయంగా మార్చుకోండి. సర్వులూ భగవంతుని బిడ్డలేనని విశ్వసించండి. "మమైవాంశో జీవలోకే జీవభూత స్సనాతనః" అన్నాడు. అందరూ నా అంశమే. అలాంటి అంశమైనప్పుడు నీవు ఏవిధంగా ఉండాలి? నేను దైవాంశ మైనప్పుడు నేను దైవకర్మలను ఆచరిస్తున్నానా? లేదా? దైవ భావములు నాలో ఆవిర్భవిస్తున్నాయా? లేదా? ఈవిధంగా నీవు విచారణ చేసుకున్నప్పుడు, అప్పుడు నీవు మమైవాంశో అనేదానికి సార్థకం చేసినవాడవవుతావు. 'మమైవాంశో' అని చెప్పటం : దానవ గుణములు, దానవ చర్యలు ఆచరిస్తుంటే, నీవు 'మమైవాంశో'ను ఎట్లు సార్థకం చేసుకోగలవు? కనుక ఈనాటి నుండి ప్రతి మానవుడు 'ప్రేమ' అనేటటువంటి దివ్యభావమును పెంచుకుంటూ రావాలి. ప్రతి దినము ప్రేమతో పదిమందిని పలుకరించు. నీ ప్రేమను పదిమందికి పంచు. ఆవిధంగా ప్రతి వ్యక్తీ చేసుకుంటూపోతే ప్రపంచంలో ఎంత మార్పు రాగలదు? ఈనాడు ఇన్ని వేలమంది ఇక్కడ చేరటానికి ఏమిటి కారణం? మీలో లేనటువంటిది, మీ ప్రాంతంలో లేనటువంటిది ఇక్కడ ఒకటి ఉండాలి. దానిని పొందటానికే మీరు యిక్కడకు వచ్చారు. అది ఏమిటి? అదియే దైవ ప్రేమ, అదియే దివ్యప్రేమ. ఆ దివ్యప్రేమ మీలో లేదు, మీ దేశంలో లేదు. కనుకనే ఇక్కడకు మీరు పరుగెత్తుకొని వచ్చారు. నిజంగా ఆరోగ్యంగా ఉన్నవాడు ఆసుపత్రిలో ఎందుకు ప్రవేశిస్తాడు. ఆరోగ్యం లేనప్పుడు ఆసుపత్రిలో ప్రవేశిస్తుంటారు. నిజంగా మీలోనే ఈ దివ్యప్రేమ ఉండి ఉంటే ఇంతదూరం

ప్రయాణమై రారు గదా! అది లేదు గనుకనే ఇంత దూరం వచ్చారు. వచ్చినారు గనుక ఈ దైవ ప్రేమను అందుకొనిపోండి, హృదయములో నింపుకొని పోండి, రోగి అయినటువంటివాడు ఇంటిలో ఉన్నా, ఆసుపత్రిలో ఉన్నా మందు తినక తప్పదు. నేను ఆసుపత్రిలో ఉన్నాను గదాయని మందు తినటం మానివేస్తే రోగం నివారణకాదు. ఎక్కడ ఉన్నా ఈ ప్రేమ అనే మందును అనుభవిస్తూ రావాల్సిందే.

**"అడవిలోననున్న ఆకాశమున మన్న**
**పట్టణమున నున్న పల్లెనున్న**
**గుట్టమీద నున్న నట్టేటనున్నను"**

ఎక్కడనుండినప్పటికి ఈ ప్రేమ తత్త్వమనేటటువంటిది మనలో ప్రకాశిస్తుండాలి. మానవుని యొక్క ప్రేమ ఒక దిక్సూచి యంత్రము వంటిది. అది ఎటుపెట్టినప్పటికినీ అది ఉత్తరము వైపునే సూచిస్తుంటుంది. అదే విధముగనే మన జీవితం ఎలాంటి పరిస్థితులు ఏర్పడినప్పటికినీ, దైవము వైపునకే మన దృష్టి పోతుండాలి. ఏ పని చేసినప్పటికినీ దైవకర్మగానే విశ్వసించి చేయాలి. ఎక్కడికి వెళ్ళినప్పటికినీ దైవస్థానముగానే విశ్వసించాలి. ఎక్కడ నడిచినప్పటికినీ అది దైవసాన్నిధ్యమనే భావించాలి. ఆవిధంగా విచారించినప్పుడు సర్వమూ దైవమయంగా రూపొందుతుంది. ఆనాటి మహర్షులు ఈవిధంగా భావించి సంచరించడం చేతనే, వారు అంతటి గొప్ప కీర్తిని సాధించి, ప్రపంచానికి ఆదర్శపురుషులుగా రూపొందారు. కనుక ఈనాటి బాలబాలికలు ఈ దివ్యమైన భావములను హృదయాలలో నింపుకొని, సమాజంలో ప్రవేశించి, యావత్ సమాజమును ప్రేమమయంగా మార్చటానికి ప్రయత్నించాలి. మనం ఏ పని చేసినా ప్రజల ఆనందాన్ని కోరాలి.

మీ అందరికి తెలుసు. 30వ తేదీన అన్ని దేశాల నుంచి క్రికెట్ ఆటను ఆడటానికి మన ప్రశాంతి నిలయం వచ్చారు. వారందరూ పవిత్రమైన హృదయంతో చక్కగా ఆడాలని నిర్ణయం చేసుకొనినారు. అట్టి ఉన్నతమైన భావంతో ఆటను ఆడారు. ఆడేవారు మాత్రమే కాదు. చూచేవారికి కూడా ఇట్టి ఆనందమును అందిస్తూ వచ్చారు. పల్లెలు, పట్టణాలు యువకులు చాలామంది చూడటానికి వచ్చారు. అసలు ఆటలు, పాటలు, మాటలు వలననే మానవ హృదయం మారుతూ వస్తుంది. కనుక మనం ఆటలు ఆడవలసిందే.

"Life is a Game, Play it
Life is a Dream, Realise it
Life is a Love, Enjoy it
Life is a Challange, Meet it"

కష్టాలను కూడా మనం ఎదుర్కొనటానికి ప్రయత్నించాలి. అదియే నిజమైన మానవ హృదయము. అట్టి నిజమైన హృదయం ఒక్క మానవునియందే ఉంటుంది. మిగతా జీవులయందు కానరాదు. అట్టి పవిత్రమైన హృదయములను కలిగిన మానవుడు ఈనాడు దైవకార్యమును విస్మరించి, దైవభావమును విస్మరించి, లోక భావములను పెంచుకొని, ఈ అనిత్యమైన సుఖములకై ఆశిస్తున్నాడు. కనుక ఈనాడు శాశ్వతమైన, నిత్యమైన సత్యమైన మార్గమును అనుభవించడానికి తగిన కృషి చేయాలి. నీవు ఏ పని చేసినా, ఏ ఉద్యోగం చేసినా, ఎక్కడ కూర్చొనినా, ఏమి చేసినా అది దైవకార్యంగా విశ్వసించి చేయి. అదే జపము, అదే ధ్యానము, అదే యోగము. అంతేకాని లౌకిక సంబంధమైన కార్యాలను వదలి పెట్టమని చెప్పటం లేదు.

"దుష్టసంకల్పముల చేత దుఃఖితుడగును
సత్యసంకల్పముల చేత సాధువగును
సర్వ సంకల్పరహితుడే శాంతి నొందు"

ఈనాడు అందరూ శాంతి కావాలని కోరుతున్నారు. సంకల్పాలు కావల్సినన్ని లోపల పెట్టుకొని శాంతి ఎట్లా మనకు లభిస్తుంది. సర్వ సంకల్పరహితుడే శాంతి నొందును. కనుక అన్ని సంకల్పములు దైవ సంకల్పములుగా మార్చుకోండి. అప్పుడే మీ జీవితం సార్థకమవుతుంది. కాలం కోసం మనం వెతుకనవసరం లేదు. కాలం కోసం వేచినుండనవసరం లేదు. కాలమే నీ దగ్గరకు పరుగెత్తుకొని వస్తుంది. సామాన్యమైన మానవుడు కాలానుగుణ్యంగా అనుసరిస్తూ వస్తుంటాడు. కాని మహనీయులు కాలమును తమచేత అనుసరింపజేస్తారు. కాలమే మంచివారిని అనుసరిస్తూ వస్తుంది. కాబట్టి కాలమును మనం హస్తగతం చేసుకోవాలి. అప్పుడే కాయం సార్థకం అవుతుంది. నీవు కాలాన్ని అనుసరించిపోతుంటే, నీ కాయము కూడనూ అనర్థకమవుతుంది. కనుక దేహం ఎంతో పవిత్రమైనటువంటిది. "జంతూనాం నరజన్మ దుర్లభమ్" ఈ మానవజీవితం ఎంత గొప్పది? కనుకనే దీనికి "తుంగభద్రాయనమః" అన్నారు. దేహమునకు 'తుంగభద్రుడు' అని పేరు. 'భద్రుడు' అనగా శాశ్వతమై నటువంటి తత్త్వము. 'తుంగ' అనగా గొప్ప కళ్యాణకరమై నటువంటి విషయం. అనగా శాశ్వతమైనటువంటి, కళ్యాణ కరమైనటువంటి విషయాన్ని అందించే నిమిత్తమై ఈ దేహము మనకు ప్రాప్తించింది. కనుక ఇట్టి పవిత్రమై నటువంటి, కారణ నిమిత్తమై ఈ దేహము వచ్చినప్పుడు, నీవు ఎంత అపవిత్రం చేస్తున్నావు? దేహము ఒక వెదురు బొంగు వంటిది. ఈ వెదురు బొంగులకు అనేకములైన కణుపులు ఉంటాయి. దీనికి గ్రంధులు అని పేర్లు. అదే విధంగా మానవ జీవితంలో ధనేషణ, దారేషణ, పుత్రేషణ. - ఇలాంటి కణుపులు ఉంటూ ఉంటాయి. ఈ మానవ జీవితమునకు అనేక రకములైన గ్రంధులు ఉంటున్నాయి. కనుకనే మానవుడు ఇన్ని రకములైన కష్టనష్టములకు గురియైపోతున్నాడు. దేహమునకు ఉంటే ఉండవచ్చును. కాని నీ హృదయమునకు మాత్రం రాకుండా చూచుకోవాలి. హృదయం నిరంతరం ఒకే విధమైన స్థితిలో ఉంటుండాలి. చలించని దృష్టిని, భ్రమించని మనస్సును చేసుకోవాలి. వ్యక్తిగతమైన భావాలకు ఏ మాత్రం అవకాశం ఇవ్వకూడదు. మానవుడు వ్యక్తిగత జీవికాదు, సమిష్టి జీవి. ఆ సత్యమును మీరు గుర్తించినప్పుడు, వ్యక్తిగతమైన జీవితమును ఏమాత్రం లెక్క చేయరు. మానవుడు వ్యష్టి జీవి కాదు, సమిష్టి జీవి. నీవు ఈ సమాజంలో ఒక సభ్యుడవు కావటం వలననే నీవు ఈ సమాజంలో జీవించగలుగుతున్నావు. కనుక ఇట్టి సమాజ తత్త్వమును మనం చక్కగా గుర్తించాలి. సర్వేశ్వరుని యొక్క భావాన్ని మన హృదయంలో నింపుకోవాలి. నిజమైనటువంటి మానవత్వం యిందులోనే ఉంటున్నది.

'మానవుడు' అనగా అజ్ఞానము లేకుండా ప్రవర్తించేటటువంటివాడని అర్థము. 'మా' అనగా అజ్ఞానము, 'న' అనగా లేకుండా, 'వ' అనగా వర్తించడం. అజ్ఞానము లేకుండా వర్తించినటువంటివాడే మానవుడు. 'మా' అనగా కాదు. 'నవ' అనగా క్రొత్త. క్రొత్తవాడు కాదు నీవు. ఎన్ని జన్మలనుంచో నీవు వస్తున్నావు. 'మానవ' అంటే క్రొత్తవాడు కాదు, అంటే పాతవాడే. సూర్యకాంతి చంద్రకాంతిపై పడటం వలన చంద్రకాంతి మనకు లభ్యమవుతున్నది. చంద్రుని యందు, సూర్యుని యందు ఉండేటటువంటిది ఒకే వెలుగు. కాని చంద్రుని వెలుగు చల్లగా ఉంటుంది. సూర్యుని వెలుగు వేడిగా ఉంటుంది. దీనికి కారణమేమిటి? "చంద్రమా మన సోజాతః చక్షో సూర్యో అజాయుతః". ఈ చంద్రుడు మనసుకు సంబంధించినవాడు. కాని మన చక్షువులనేటటువంటివి జ్ఞానమునకు సంబంధించినటువంటి సూర్యుడు. కనుక మన జ్ఞాననేత్రములనేటటువంటివి సూర్యుని యొక్క వెలుగై ఉండాలి. చంద్రుడు ఏవిధంగా స్వప్రకాశకుడు కాదో, అదే విధముగ మనసు స్వప్రకాశం కాదు కనుకనే, జగత్తుపై సంచరిస్తూ ఉంటుంది. లోకాన్ని ఆకర్షించేది మనసు(Mind). జ్ఞానమును ఆకర్షించేది సూర్యుడు. కనుకనే మానవుడు జ్ఞాన ప్రకాశకుడు కావాలి గాని, లోక ప్రకాశకుడు కాదు. లోకాన్ని నీవు అనుభవించు. అది కూడా దైవానుభవంగానే మార్చుకో. అదియే నిజమైనటువంటి మానవత్వం.

ఈ విధమైనటువంటి మానవత్వాన్ని క్రొత్త సంవత్సరం నుంచి మార్చుకుంటూ వస్తే మీరు దేశానికి ఎంతో ఉపకారం చేసినవారవుతారు. నైతిక, భౌతిక, ధార్మిక, ఆధ్యాత్మిక, రాజకీయ, వైజ్ఞానిక - అన్ని రంగములలో మీరు ప్రవేశించండి. దేనిలో నీవు ప్రవేశించినా, నీ హృదయస్థానాన్ని మాత్రం మార్చుకోకూడదు. అప్పుడే నీవు శాశ్వతమైన కీర్తిని పొందినవాడవవుతావు. శాశ్వతమైన దానిని సాధించడానికి మనం వచ్చాం. అశాశ్వతమైన దానిని సాధించడానికి ఈ జన్మ ఎత్తే అవసరంలేదు.

**విద్యార్థులారా!**

ఈ వయస్సు చాలా అమూల్యమైనది. దీనిని Golden Age అంటారు. ఈ వయస్సును దుర్వినియోగ పరచరాదు, వ్యర్థ పరచరాదు. కాలమును వ్యర్థపరచరాదు. కాలమును వ్యర్థం చేస్తే మన కర్మలన్నీ, వ్యర్థమైపోతాయి. కాలము దైవస్వరూపము. కనుక కాలము వ్యర్థము చేయరాదు. Time Waste is Life Waste. కాలం వ్యర్థం చేసిన యెడల జీవితమే వ్యర్థమవుతుంది. కనుక కాలమును వ్యర్థం చేయకుండా మీ కర్తవ్యాలను నిర్వర్తిస్తూ రండి. పెద్దలను గౌరవించండి, తల్లిదండ్రులను ప్రేమించండి. సమాజమునకు సేవచేయండి. ఇది నిజమైన మన పని. ఈ విధమైన వినయ విధేయతలు పెంచుకొన్నప్పుడే విద్యకు తగిన ఘనత ఏర్పడుతుంది. "విద్యా వినయ సంపన్నః" విద్యకు వినయం చాలా అవసరం. "సద్గుణంబులు, సద్బుద్ధి, సత్యనిరతి, భక్తి, క్షమాగుణం, కర్తవ్య పాలనములు నేర్పునదియే విద్య." ఇలాంటి సద్గుణంబులు లేకుండా, మేము విద్యావంతులం... విద్యావంతులం.... అంటే ప్రయోజనం? వీటన్నింటి ద్వారా ముఖ్యముగా వినయమును పెంచుకోవాలి. పెద్దలను గౌరవించాలి. వినయ విధేయతలను నిరూపించాలి. మంచిపలుకులు పలకాలి. You Cannot Always Oblize, but You Can Speak Always Oblizingly. ఇతరుల మనస్సును కష్టపెట్టకుండా మాట్లాడాలి. వారి నిమిత్తమై నీ మనసు కూడా కష్టపెట్టుకోకూడదు. నీవూ ఆనందంగా ఉండు. ఇతరులను ఆనందపెట్టు. 'నొప్పించక, తానొవ్వక తప్పించుకు తిరుగువాడే ధన్యుడు' అన్నారు. ఈవిధమైన జీవితాన్ని మనం గడుపుతూ రావాలి.

పూజలు చేయడం, భజనలు చేయడం, ధ్యానం చేయడం, జపములు చేయటం - ఇది కాదు నిజమైన భక్తి. వీటిని భక్తి అనే దానికన్నా , సత్కర్మలు అని చెబితే బాగుంటుంది. అనురక్తిని పెంచుకొని, ముక్తిని పొందాలి. ఇదే నిజమైన భక్తి. ఈ అనురక్తిని మనం విరక్తిగా మార్చాలి. ఈ విరక్తినే మనం రక్తిగా తీసుకోవాలి. ఈ రక్తినే మనం ముక్తిగా మార్చుకోవాలి. ముక్తి అనేది ప్రత్యేకంగాలేదు. ఈలోక సంబంధమైన విరక్తియే నిజమైన ముక్తికి మార్గము.

మోక్షం.........మోక్షం....... అంటే ఏమిటి? మోహక్షయమే మోక్షము. కోరికలు క్షయం లేకుండా మోక్షం ఎలా లభ్యమవుతుంది. కోరికలు (Desires) ఉండాలి. కాని వాటిని పరిమితులలో పెట్టుకోవాలి. Less Luggage More Comfort. కోరికలు ఉండవచ్చు. కాని వాటిపై పరిమితి మాత్రం పెట్టాలి. ఈ క్రొత్త సంవత్సరం నుంచి అనగా ఈనాటి నుంచి పిల్లలు కూడా చాలా వినయ విధేయతలను పెంచుకుని, పవిత్రమైన ఆదర్శమును అందించేటటువంటి విద్యార్థులుగా తయారైనప్పుడే, నాకు చాలా ఆనందంగా ఉంటుంది.

నిన్న మా ట్రస్టు వారి మీటింగులో నేను ఒక విషయం చెప్పాను. ఇందూలాల్ షా యిక్కడనే ఉన్నాడు. నాకు ఈ ఆస్తుల (Properties) విషయంలో నాకు సంబంధం పెట్టకండి. ఈ ధనంతో నాకు ఎట్టి సంబంధం పెట్టకండి. నాకు ఈ ధనం (Money) తో గాని ఈ ఆస్తుల (Properties) తో గాని నాకు ఏమాత్రం సంబంధం లేదు. భక్తులకు నాకే సంబంధం ఉంటుంది. అని ఆ విధంగా చెప్పి అన్నింటికి సంతకాలు (Signatures) చేసి వచ్చేశాను. నా ప్రాపర్టీ, నా ఆస్తి మీరే. ఇంత తరగనటువంటి ఆస్తిని నేను ఉంచుకుని, ఈ తరిగి పెరిగేటటువంటి ఆస్తిని నేను ఎందుకు ఆశించాలి? పిల్లలే నా ప్రాపర్టీలు (ఆస్తులు) సాయి ఆదర్శములను ఈ పిల్లలు అనుసరిస్తే, అంతకంటే ఆనందం మరొకటి లేదు. అదే నాకు మీరు యిచ్చేటటువంటి సుంకం(Tax). మీ నుంచి ఏ Tax ను నేను తీసుకోవటం లేదు. ఏవిధమైన ఫీజును తీసుకోవటం

లేదు. అడ్మిషన్ ఫీజుగాని, అటెండెన్స్ ఫీజు గాని, ఎగ్జామినేషన్ ఫీజుగాని, గేమ్స్ ఫీజుగాని, ఏ ఫీజును మీ నుంచి తీసుకోవటం లేదు. కాని ఒక్క ఫీజు మాత్రం నేను అడుగుతున్నాను. అదియే 'ప్రేమ' అనే ఫీజు. దానిని ఒక్కటీ అర్పించండి. లక్ష్మణుడు రాముని యొక్క సేవ నిమిత్తమై సర్వమునూ త్యాగం చేశాడు. అన్ని సంవత్సరాలు అరణ్యాలలో సీతారాముల సేవ చేస్తూ కూడా, సీత మొహమును ఏనాడు చూడలేదు. కారణమేమిటి? పరస్త్రీని చూడటం మహాపాపమని భావించాడు. అన్న భార్య తల్లితో సమానమని భావించి సీతను తల్లితో సమానంగా చూచుకున్నాడు. కనుక మన దృష్టి మంచిదిగా ఉండాలి. మన చేతులను సరియైన కర్మలలో ప్రవేశపెట్టాలి. కన్నులున్నాయని కాకులలాగే చూడగూడదు. కాకి అన్ని వైపులా చూస్తుంది. కాని దేనిని చూస్తుంది? చెడిపోయిన పదార్థములను తీసుకొని పోవాలని చూస్తుంది. కాబట్టి మన కన్నులు పవిత్రమైన దైవం పైన పెట్టటానికి ప్రయత్నించాలి. కన్నులు మూసుకున్నా, తెరుచుకున్నా దైవ చిత్రమే కనిపించాలి. ఆ విధమైన దృష్టిని కలిగినప్పుడు సృష్టి అంతా మారిపోతుంది.

**ప్రేమస్వరూపులారా!**

ఈనాడు క్రొత్త ఆంగ్ల సంవత్సరం. భారతీయులకు కూడా వేరే క్రొత్త సంవత్సరం ఉంది. దక్షిణాది వారు చాంద్రమానమును, ఉత్తరాదివారు సూర్యమానము ప్రకారము నూతన సంవత్సరమును తీసుకుంటారు. ఈ విధంగా ఎవరెవరి అనుకూలం బట్టి వారు ఏర్పర్చుకున్నారు. ఏ విధంగా తీసుకున్నా సంవత్సరం సంవత్సరమే. క్రొత్త సంవత్సరం కోసం వేచి ఉండకండి. ప్రతి సెకనూ సంవత్సరముగా భావించుకోండి. దైవ ప్రీతికరమైన కర్మలను చేస్తూ రాండి. దైవప్రేమను పెంచుకోండి. ఏది ఉన్నా లేకపోయినా, దైవ ప్రేమ ఒక్కటి ఉంటే సర్వమునూ నీవు సాధించగలవు.

సత్యహరిశ్చంద్రుడు సర్వమునూ కోల్పోయాడు. రాజ్యమును కోల్పోయాడు, భార్యాబిడ్డలను అమ్మి కాటి కాపరి అయినాడు. కాని ఏ మాత్రం భయపడలేదు. సత్యమును విడనాడలేదు. సత్యం కోసం తన జీవితాన్ని అర్పించాడు. 'Truth is God' అని భావించాడు. దేవుని కోసం అర్పించానని భావించాడు. కట్టకడపటికి దైవం మెచ్చుకొని పోగొట్టుకున్న అన్నింటినీ తిరిగి యిచ్చాడు. కనుక అట్టి త్యాగము చేసినప్పుడు, అన్నింటినీ మనం సాధించిన వారమవుతాము.

ఇది క్రొత్త సంవత్సరం. ఈనాటి నుంచి అందరూ సుఖంగా, సంతోషంగా, ఏవిధమైన బాధలు లేకుండా, ఆనందంగా, ఆరోగ్యంగా, వర్ధిల్లాలని నేను ఆశిస్తున్నాను, ఆశీర్వదిస్తున్నాను. 'శతమానం భవతి శతాయుః పురుషః శతేంద్రియ ఆయుష్యేంద్రియ ప్రతితిష్ఠతి' అని ప్రాచీన ఋషులు ఆశీర్వదించారు. శతమానం అనగా నూరు సంవత్సరాలు బ్రతకండి అన్నారు. వంద సంవత్సరాలు ఎందుకు బ్రతకాలి? మంచిని సంపాదించటానికోసం బ్రతకాలి. లేకపోతే వంద సంవత్సరాలు బ్రతికి ప్రయోజనం ఏమిటి?. కనుకనే ఆనాటి మహానుభావులు "కాకివగుచు కలకాలం తిరుగక హంసవై క్షణకాలం ఆడుమురా!" అన్నారు. అందరూ సుఖంగా జీవించండి! Long life, Healthy Life, Long Life, Peaceful Life and Divine Life. ఆయొక్క Divine Love (దివ్యప్రేమ, దైవప్రేమ) తోనే మీ జీవితాన్ని సార్థకం చేసుకోండి.

*(ది. 1-1-98న సాయి కుల్వంత్‌లో భగవాన్ సాయి చేసిన నూతన ఆంగ్ల సంవత్సర దివ్య సందేశము నుండి)*

## శ్రీవాణి పోషకులు



శ్రీ పి.కె.ఆర్. మోహన్
శ్రీమతి పి.ఎ. దేవి
చంద్రనగర్ పోస్టు, (యు.పి)

# ఆడిన మాట

సకల ప్రాణులు సర్వేశ్వరుని సృష్టి ఫలితమే! ప్రాణులెన్నైనమా, నోరు విప్పి మాట్లాడగలిగేది మానవ ప్రాణి ఒక్కటే! మానవులకు దైవమిచ్చిన అద్భుత శక్తే మాట! ఆ మాటకున్న విలువ మహోన్నతము. మానవుని నోటి నుండి వెలువడే సద్భాషణమే వరము, దుర్భాషణమే శాపము. విశుద్ధ మనస్కుడైన మనిషి పలికినదంతా కార్య రూపం దాలుస్తుంది! అందుచేత వాక్శక్తిని వృథా కానీయరాదు. అవసరమైనప్పుడు మాట్లాడకుండుట, అసందర్భముగ మాట్లాడుట మర్యాద లక్షణము కాదు. మాటాడుటకు ముందే పదిమార్లు ఆలోచన చేయాలి! ఆడిన మాటను ఆచరణలో చూపాలి! అంటే ఆడిన మాట తప్పరాదు. కాలుజారితే తీసికోగలముగాని, నోరు జారితే తీసికోలేమన్నది అందరకు తెలిసిన విషయమే!

ఆడిన మాట తప్పుట ఆత్మహత్యా సదృశ్యమే! ఇచ్చిన మాట కోసం, ఆడిన మాట కోసం ఎన్ని కష్టాలనైనా ఎదుర్కోవాలి! ఆఖరుకు ప్రాణ త్యాగానికైనా సిద్ధపడాలి! మానవుని మనుగడ ధర్మబద్ధంగాను, నీతి నియమాలతోను సాగేందుకు అనువైన మార్గాలెన్నో ఉన్నాయి. అలాంటి మార్గాల్లో ఆడిన మాట నిలబెట్టుకోవడం ముఖ్యమైనది. ప్రసిద్ధులైన మహామహులెందరో మనకు నేర్పే నీతి యిదే!

- ఈ సందర్భంగా మనకు గుర్తొచ్చేది ఆవు - పులి కథ! ఆకలిగొన్న ఓ పులి కంటపడుతుంది ఒక ఆవు. అమాంతం మీదకు దుమకబోతున్న పులిని బ్రతిమాల సాగింది గోవు! " నా లేగ దూడకు పాలుకుడిపి వచ్చి నీకాహారమవుతాను!" అంటూ ప్రాధేయపడుతుంది. చేతికి చిక్కిన ఆహారాన్ని వదులుకోవడానికి యిష్టపడదు పులి. ఆవు పదే పదే ప్రార్థించడంతో "మాట తప్పవుగా!" అంటూ అంగీకరిస్తుంది! అనుకున్న సమయాని కన్న ముందుగానే తిరిగొచ్చిన గోవును చూడగానే ఆశ్చర్యంతో నోరు తెరిచేసింది ఆ వ్యాఘ్రము. ఆ గోమాత సత్య సంధతకు ఆనందంతో తబ్బిబ్బైపోయి, తన ఆహారం మాటే మరిచిపోయింది. " నీ బిడ్డతో సంతోషంగా బ్రతుక" మంటూ వెళ్ళిపోతుంది పులి!

అదీ మాట నిలబెట్టుకోవడమంటే!

అలాగే మనకు సుపరిచితమైన సత్య సంధుడు హరిశ్చంద్రుడు! విశ్వామిత్రునికి యిస్తానన్న ధనం సమకూర్చడానికి ఆ మహానుభావుడు ఎన్నెన్ని కష్టాల పాలయ్యాడో అందరికి తెలుసు! అధికారం కోల్పోవడం,

## సోమంచి రామం

ఆలిని అమ్ముకోవడం, ఆఖరుకు కన్న బిడ్డన్న కరుణ లేకుండా కాటి సుంకం వసూలు చేయడం - ఇవన్నీ దేని కోసం? కేవలం ఆడిన మాట తప్పకుండా ఉండడం కోసమే కదా! అందుకే యుగాలు మారినా, జగాలు మారినా ఆయన చిరస్మరణీయుడు!

మత్స్యకన్య సత్యవతిని పరిణయమాడదలచిన తన తండ్రి శంతనుని మనోభీష్టము నెరవేర్చడానికై, తానసలు వివాహమే చేసికోనని అందరి సమక్షంలో భీషణ ప్రతిజ్ఞ చేస్తాడు దేవవ్రతుడు! ఆడిన మాట ప్రకారం ఆజన్మాంతము బ్రహ్మచర్యం కొనసాగించిన మహామహుడు ఆ భీష్ముడు!

ఆధునిక కాలానికి వస్తే, మన జాతి పిత మహాత్మాగాంధీ అలాంటి కోవకు చెందిన మహానుభావుడే! విదేశీ ప్రయాణానికి ముందు తల్లికి ప్రమాణం చేసి చెప్తాడు. మద్యం, మాంసం, మగువలకు దూరంగానే ఉంటానని మాటయిస్తాడు తల్లికి! ఆ మాటను నిలబెట్టుకొని తల్లికి ఆనందం చేకూరుస్తాడు.

మన భారతీయ సంస్కృతిలో యిదొక అపురూప ధర్మము. ఈ వారసత్వ ధర్మాన్ని మనం కాపాడుకొందాం! అందుకే,

**మాట నివ్వ కోరుకోకు !**

**మాట విచ్చి తప్పబోకు !!**

చైనీస్ నూతన సంవత్సరం సందేశం

# ప్రేమను పెంచుకోండి! సత్యమును పలకండి! ధర్మాన్ని ఆచరించండి! శాంతిని పొందండి!

"శివ ఏవ సదా జీవం
జీవ ఏవ సదాశివం
వేద్యైక్య మనయోర్యస్తు
సాత్మాజ్ఞో నచేతన"

ప్రేమ స్వరూపులారా !

ఈనాటి మానవుడు ఎన్నియో విధములైన జ్ఞానములను ఆర్జిస్తూ వస్తున్నాడు. మానవుడై పుట్టి సింహంవలె జీవించడం, సింహం వలె ఆడటం, మృగములవలె జీవించడం, మృగముల వలె సంచరించడం ఇత్యాది విద్యలను కూడా నేరుస్తున్నాడు ఈనాడు మానవుడు.

జ్ఞానమనగా ఏమిటి? బహుళ గ్రంథపరిచయం కాదు జ్ఞానం. చరాచర ప్రపంచమునందుగల సమస్త విషయములను గుర్తించడం జ్ఞానం కాదు. వ్యష్టియందు, సమిష్టియందు ఉండినటువంటి ఏకత్వాన్ని గుర్తించడమే నిజమైన జ్ఞానం. అయితే ఈనాటి మానవుడు తనయందున్న మానవత్వాన్నే గుర్తించడానికి ప్రయత్నించడం లేదు. అట్టి మానవుడు తన యందున్న దైవత్వాన్ని ఏరీతిగా గుర్తించగలడు? మొదట మానవుని యందున్న మానవత్వాన్ని గుర్తించినప్పుడే, దైవత్వాన్ని కూడా గుర్తించడానికి అర్హుడవుతాడు. అట్టి మానవత్వాన్ని గుర్తించడానికి మార్గమేమిటి? దీనినే బుద్ధుడు అనేక విధములైన సాధనలు సలిపి, కడపటికి మానవత్వము యందున్న దైవత్వాన్ని గుర్తించడానికి మానవుని యొక్క పంచేంద్రియములే మూలకారణమన్నాడు. తమ ఇంద్రియములను సక్రమమైన మార్గములో ప్రవేశపెట్టి, దివ్యమైన భావములను అనుభవించి, తన దివ్యత్వాన్ని తాను వెలిబుచ్చుకోవాలి. కనుక బుద్ధుడు మొదట 'సమ్యక్ దృష్టి' అన్నాడు.

సమ్యక్ దృష్టి అనగా మానవుడు ఈ కన్నులతో పవిత్రమైన దృశ్యములను, పవిత్రమైన వ్యక్తులను మాత్రమే చూడాలి. అట్లుకాక కన్నులు ఉన్నవిగదాయని దేనిని పడితే దానిని చూడటం, ఎవరిని పడితే వారిని చూచి అపవిత్రం గావించుకోవడం చేతనే, ఆ దృశ్యములన్నియు మానవుని హృదయంలో చిత్రించబడి దుష్టమైన భావములు,

## భగవాన్ సాయి దివ్య బోధ

దుష్ట సంకల్పముల చేత మానవుడు దుఃఖితుడవుతున్నాడు. ఎట్టి దృశ్యమో అట్టి హృదయమైపోతున్నది. ఎట్టి హృదయమో అట్టి సంకల్పములు ఆవిర్భవిస్తున్నాయి. ఎట్టి సంకల్పములో అట్టి వాక్కును అనుభవిస్తున్నాడు. ఎట్టి వాక్కో అట్టి జీవితాన్ని పొందుతున్నాడు. కనుక మొట్టమొదట మంచి జీవితములను అనుభవించవలెననిన మొట్టమొదట 'సమ్యక్ దృష్టి' ఉండాలి. పవిత్రమైనటువంటి దివ్యమైనటువంటి, భవ్యమైనటువంటి దృష్టిని మానవుడు అనుభవించాలి. అపవిత్రము, అసహ్యము, ఘోరము - ఇత్యాది దృశ్యములను చూడటం చేతనే మానవుడు మృగము వలె జీవిస్తున్నాడు. కనుక ఏది పవిత్రము? ఏది దివ్యమైనటువంటిది? ఏది చూడదగినటువంటిది అనే విచారణ మానవుడు మొట్టమొదట చేయాలి.

ఈనాటి మానవుడు అనేక దుఃఖములచేత, కష్టములచేత, అశాంతుల చేత జీవితాన్ని గడుపుతున్నాడు. కారణమేమిటి? తాను చూచిన దృశ్యములు అపవిత్రమైనటువంటివి, అసహ్యమైనటువంటివి, ఘోరమైనటువంటివి కావటం చేతనే, తన హృదయము నుండి అట్టి ఫలితములు ఆవిర్భవిస్తున్నాయి. కనుక మానవ జీవితంలో దృష్టియే మొట్టమొదటిది. దృష్టి ఎట్టిదో సృష్టి అట్టిది. కనుకనే మన శాస్త్ర జ్ఞానమంతయూ నేత్రములపైననే ఆధారపడి ఉంటున్నది. నేత్రమే శాస్త్రము, దృష్టియే సృష్టి. మనం శాస్త్ర జ్ఞానమును పొందాలనుకుంటే, దృష్టిని సమగ్రమైన, పవిత్రమైన దృష్టిగా ఏర్పరుచుకోవాలి. కనుక మొట్టమొదట

మానవుడు తన దృష్టిని పవిత్రం గావించుకోవాలి. చూడదగని దానిని చూడటానికి ప్రయత్నించకూడదు. ఏది చూడవచ్చునో, ఏది పవిత్రమైనదో, ఏది మంచిదో విచారణ సలిపి దానిని మాత్రమే చూడటానికి ప్రయత్నించాలి. అట్టి పవిత్రమైన దృష్టియే మానవుని హృదయములో సృష్టించబడుతున్నది. ఆ దృష్టియే మానవుని హృదయ క్షేత్రమునందు నాటబడిన విత్తనములవంటివి. ఇది చెడ్డ దృష్టిగా ఉండినప్పుడు చెడ్డ ఆలోచనలు బయలుదేరుతాయి. మంచి దృష్టిగా ఉండినప్పుడు మంచి ఆలోచనలు బయలుదేరుతాయి. అప్పుడు మానవుని యందు చెడ్డ భావములుగాని, చెడ్డ సంకల్పములుగాని రావటానికి అవకాశముండదు. కనుక మొట్టమొదట మన దృష్టిని పవిత్రమైన దానిగా రూపొందించుకోవాలి.

ఆత్మశాంతికోసం, ఆనందం కోసం ప్రపంచమంతా పర్యటించాడు బుద్ధుడు, అనేక విధములైన ఆరాధనలు సలిపాడు. ఇది పండితులవలన లభించేది కాదని, కేవలం గ్రంధ పఠనలవలన పొందేది కాదని గ్రహించాడు. భగవంతుడు ప్రసాదించిన పంచేంద్రియములను పవిత్రం గావించుకున్నప్పుడే పవిత్రుడనవుతాననే సత్యమును గుర్తించాడు. నిత్యజీవితంలో అనుభవించేటటువంటి ఇంద్రియములనే పవిత్రం గావించుకోలేనటువంటి మానవుడు, ఇక ఇంద్రియాతీతమైనటువంటి తత్వాన్ని ఏరీతిగా పొందగలడు? కనుక మొట్టమొదట మన దృష్టిని సక్రమమైన రీతిలో పెట్టుకోవాలి. అప్పుడే మనలో మంచి భావములు, సమ్యక్ భావములు ఆవిర్భవిస్తాయి. మంచి భావములు ఆవిర్భవించినప్పుడే మంచి వాక్యములు బయలుదేరుతాయి. దానినే 'సమ్యక్ వాక్కు' అన్నారు. నాలుక ఉన్నది గదాయని ఇష్టము వచ్చినట్లు మాట్లాడకూడదు. భగవంతుడు నాలుక యిచ్చింది దేనికి? పవిత్రమైన వాక్కులు మాట్లాడేందుకు, సత్యమైన పలుకులను పలికే నిమిత్తం, పవిత్రమైన దృశ్యములను చూచి వాటిని వర్ణించే నిమిత్తం నాలుకను భగవంతుడు మనకు యిచ్చాడు. కేవలం రుచికరమైన పదార్థములను భుజించేందుకు నాలుకను యివ్వలేదు. రసరహితమైన మాటలను మాట్లాడే నిమిత్తమై నాలుకను అందించలేదు. పరులను బాధించే వచనములను మాట్లాడే నిమిత్తమై నాలుకను మనకు యివ్వలేదు. అసత్యమును పలికే నిమిత్తమై నాలుకను మనకు అందించలేదు. సత్యవాక్కుల చేత పరులను ఆనందపరచేందుకు దివ్యమైనటువంటి భగవంతుని వర్ణించే నిమిత్తమై మనకు ఈ నాలుకను అందించాడు.

ఈనాటి మానవుడు ప్రపంచములోనున్న సర్వ గ్రంథములను చదవటానికి ప్రయత్నిస్తున్నాడు. ఇంతకంటే పెద్ద అజ్ఞానం మరొకటి లేదు. చచ్చేంతవరకు చదువుతూ పోతుంటే, చదివిన దానిని ఆచరణలో పెట్టేది ఎప్పుడు? నీవు విశ్వసించిన దానిని నీవు ఆచరణలో పెట్టటానికి ప్రయత్నిస్తున్నావా? అంటే లేదు. ఆచరణలో పెట్టకుండా పుస్తకాలు చదివి ప్రయోజనం ఏమిటి? ఇదంతా కేవలం లోకమును మోసం చేసేందుకే చేస్తున్నారు. ఇలాంటి గ్రంథ పఠన చాలా అపవిత్రమైనది. బుద్ధుడు కూడా ఇలాంటి పరిశోధన చేస్తూ వచ్చాడు. అనేక గ్రంథములు చదివాడు, అనేక మంది మహనీయులను దర్శించాడు, అనేక విషయాలను శ్రవణం చేశాడు. మనసుకు తృప్తి కలుగలేదు. ఇది సరియైన జ్ఞానము కాదనుకున్నాడు. అంతఃకరణ పరిపుష్టమైన తత్త్వమే సరియైన జ్ఞానము అన్నాడు. అంతఃకరణ తృప్తికలిగినటువంటిదే పరిపూర్ణ జ్ఞానము అన్నాడు. అంతఃకరణ పరిపూర్ణమైనటువంటి తృప్తిని పొందటానికి తన ఆచరణే మూలకారణమనుకున్నాడు బుద్ధుడు. కనుక వాక్యములు కూడా అత్యంత ప్రధానమైనవిగా భావించాడు. ఎవరితోపడితే వారితో ఇష్టము వచ్చినట్లు మాట్లాడటానికి కాదు నాలుకను యిచ్చింది. నీ భావములతో ఎవరు ఏకీభవిస్తారో, నీ భావములకు సహాయం కలిగే భావములు ఎవరి వద్ద ఉంటాయో, అటువంటి వారితో మాట్లాడాలి. అధిక భాషణలచేతనూ, అపవిత్రమైన దృష్టి చేతనూ హృదయము అపవిత్రమైపోతున్నది. కనుకనే నీ మాత్రం శాంతిని పొందలేకపోతున్నాడు. ఇది శాంతి సంవత్సరం.

శాంతిని పొందాలంటే మనం ఏం చేయాలి? మొట్టమొదట మన దృష్టిని పవిత్రమైన రీతిలో మార్చుకోవాలి. తదుపరి పవిత్రమైన భావములు మనలో

ఆవిర్భవించాలి. ఆ భావముల చేత పవిత్రమైన వాక్కులు మనలో రావాలి. ఈ మూడింటి యొక్క ఏకత్వంచేతనే మానవత్వం సార్థకమవుతోంది. దీనినే The Proper Study of Mankind is Man అన్నారు. దృష్టి, భావము, వాక్యము - ఈ మూడింటి యొక్క ఏకత్వం కలగాలి.

ఇప్పుడు వ్యష్టికి, సమిష్టికి మధ్యనున్న ఏకత్వమును గుర్తించాలి. అసలు సమాజమునకు, వ్యష్టికి మధ్యనున్న సంబంధమేమిటి? వ్యక్తులు పదిమందిగా చేరినప్పుడు దానిని సమాజమంటాం. మానవ ఏకత్వమే విశ్వవ్యాప్తి. కనుక మొట్టమొదట వ్యక్తి చక్కబడినప్పుడు, సమాజం చక్కబడుతుంది. వ్యక్తి మంచివాడైనప్పుడు, సమాజం కూడా మంచిదవుతుంది. వ్యక్తి క్షేమంగా ఉండినప్పుడు, సమాజం కూడా క్షేమంగా ఉంటుంది. వ్యక్తి మంచివాడు కావటానికి కారణమేమిటి? పవిత్రమైన దృష్టి పవిత్రమైన ఆలోచనలు, పవిత్రమైన వాక్యములు - ఈ మూడింటి ఏకత్వం మనలో ఆవిర్భవించాలి. మానవత్వంలోనున్న దివ్యత్వాన్ని గుర్తించాలంటే మొట్టమొదట దృష్టిని సరియైన రీతిలో ఉంచుకోవాలి. మానవునిలో చెడ్డ ఆలోచనలు రావటానికి మూలకారణం ఏమిటి? తన దృష్టి యొక్క Reactionయే తన ఆలోచనలకు మూలకారణం.

"చిత్తస్య శుద్ధయే కర్మః" మనం చేసే కర్మల వలన చిత్తశుద్ధి ఏర్పడుతుంది. ఈనాటి మానవుని యందు అమితమైన వాంఛలు మితిమీరిపోతున్నాయి. తాను ఆచరణలో పెట్టని విషయాలు చదువుతున్నాడు. తాను ఆచరణలో పెట్టలేని విషయాలను చూస్తున్నాడు. తాను ఆచరణలో పెట్టలేని వాక్యాలను పలుకుతున్నాడు. ప్రయోజనమేమిటి? తాను ఆచరణలో పెట్టగలిగి నటువంటి ఒక్క విషయాన్ని అయినా తాను చదివి, తాను చూచి, తాను అనుభవించినప్పుడు తాను సార్థకత పొందుతాడు.

ఈనాడు చెప్పేవారు చాలామంది కనిపిస్తున్నారు. కాని ఆచరణ పెట్టేటటువంటి ఘనులు ఒక్కరైనా కనిపించటంలేదు. కనుకనే దేశం ఇన్ని విధములైన అశాంతులకు గురిఅవుతున్నది. తలచే భావములు, చెప్పే వాక్యములు, చేసే పనులు - ఈ మూడింటి యొక్క ఏకత్వాన్ని చూడాలి. ఈ మూడింటి యొక్క ఏకత్వం చేత మనకేమి ఏర్పడుతున్నది. కర్మలనాచరిస్తున్నాడు. చూచిన దానిని తలచి, తలచిన దానిని చెప్పి, చెప్పిన దానిని చేయటం - దీనినే "సమ్యక్ కర్మ" అన్నారు. కర్మ అనగా ఏమిటి? చేసేటటువంటి పని. ఎట్టి పని చేయాలి? చూచినటువంటి దానిని తలచినప్పుడు, తలచినదానిని చెప్పినప్పుడు, ఈ మూడింటికి సంబంధించిన కర్మను చేయాలి. ఈ మూడింటికి విరుద్ధమైన కర్మలను ఆచరించడం చేత తాను మరింత అపవిత్రుడైపోతున్నాడు. ఈ సమ్యక్ కర్మనే 'సమ్యక్ సాధన' అన్నాడు బుద్ధుడు. అదియే నిజమైన సాధన. ధ్యానము చేయటం, జపము చేయటం, పూజలు చేయటం - ఇవన్నీ కావు సాధనలు.

## జన్మభూమి

జనని జన్మభూమి స్వర్గతుల్యంబని
పరవశించి పలుకు పలుకు కంటె
చేవ చూపి 'సేవ' చేయుట ముద్దురా!
తెలిసి నడచు కొనుము తెలుగుబిడ్డ!!

పిల్ల వేరు లన్ని తల్లి వృక్షంబుకు
జీవ మొసగు సృష్టి చిత్ర మరసి
జన్మభూమి పైన సారించ వలె దృష్టి!
తెలిసి నడచుకొనుము తెలుగు బిడ్డ!!

మాతృమూర్తి కొరకు మాతృభూమికొరకు
నడుము వంచి కష్టపడుట కన్న
సన్నుతింప దగిన సత్కార్యమేలేదు!
తెలిసి నడచుకొనుము తెలుగుబిడ్డ!!

'జన్మభూమి' కొరకు శ్రమచేసినందుకు
ఫలిత మడుగ నేమి ఫలితముండు
'సేవ' లక్షణంబు చేయుజాపుటగాదు!
తెలిసి నడచుకొనుము తెలుగు బిడ్డ!!

- ఏకా రామచంద్రరావు

ఇవన్నీ సత్కర్మలే. నిజమైన సాధన అంటే ఏమిటి? చూచిన దానిని తలచటం, తలచిన దానిని చెప్పటం, చెప్పిన దానిని చేయటం - ఇదే నిజమైన సాదన.

ఈ సాధన పూర్తి అయిన తరువాత సమ్యక్ జీవనమ్ అన్నారు. ఇదే పంచేంద్రియముల యొక్క తత్త్వము. 1. సమ్యక్ దృష్టి 2. సమ్యక్ భావములు 3. సమ్యక్ వాక్కు 4. సమ్యక్ కర్మ 5. సమ్యక్ సాధన 6. సమ్యక్ జీవనమ్. మంచి జీవనం మనం పొందాలనుకుంటే మంచిని చూడాలి. మంచి భావములు ఉండాలి. మంచిని చెప్పాలి, మంచి పనులు చేయాలి, మంచిపనులు సాధన చేయాలి. ఈ సాధన లోపల మానవుడు గుర్తించవలసిన ప్రధానమైనది ఉన్నది. మానవునియందున్న దుర్భావములను దూరంచేయాలి, సద్భావనలను లోపల ప్రవేశపెట్టాలి- అదియే నిజమైన సాధన. సత్సంకల్పములను అభివృద్ధిపరచుకొని, సత్కర్మలలో ప్రవేశించాలి. అవసాన దశలో బుద్ధుడు ఒక్కమాటచెప్పాడు. మానవుడు సుఖపడాలని అనేక విద్యలు నేరుస్తున్నాడు. అనేక ఉద్యోగాలు చేస్తున్నాడు. వివాహ మాడుతున్నాడు. బిడ్డల్ని కంటున్నాడు. భవనములు కడుతున్నాడు కాని కట్టకడపటికి సుఖపడుతున్నాడా సుఖము ఇందులో లేదని భావించాడు. కట్ట కడపటికి తన పినతల్లి గౌతమి కుమారుడైన 'ఆనంద్' ని పిలిచి తలపై చేయి పెట్టి "నాయనా! నేను సత్యమును బోధించే నిమిత్తమే వచ్చాను. భగవంతుడు ఎక్కడ చూచినా ఉన్నాడు. సత్యమే భగవంతుడు. (Turth is God) సత్యమును పలుకుము". అని చెప్పాడు.

రెండవది "అహింసా పరమో ధర్మః" అన్నాడు. ధర్మమంటే ఏమిటి? బ్రహ్మ చర్య ధర్మమా? గృహస్థ ధర్మమా? వానప్రస్థ ధర్మమా? సన్యాస ధర్మమా? శాస్త్ర ధర్మమా? ఏది ధర్మము? ఇవన్నీ ధర్మములే కావు. ఇవన్నీ అనిత్యములు. మానవ జీవితం ఉన్నంతవరకు ఇవన్నీ అనుభవించవలసిన ధర్మములు. 'అహింసా పరమో ధర్మః' ఒక్కటే నిజమైన ధర్మము. దీనినే వేదములందు "సత్యం బ్రూయాత్, ప్రియం బ్రూయాత్" అన్నారు. ఈ ప్రియమైనటువంటిదే ధర్మము. ధర్మమునకు రెండవ పదము ప్రియము అంటారు.

మానవునియందున్న పంచేంద్రియాలను పవిత్రం చేసుకోవటమే సత్యమని చెప్పాడు బుద్ధుడు. ఈ పంచేంద్రియములను మాలిన్య పరచుకొని ఎన్ని సాధనలు చేసి ఏమి ప్రయోజనం? Tank లో మాలిన్య జలం ఉంటే ఏ Tap త్రిప్పినా మాలిన్య జలమే వస్తుంది గాని, పరిశుద్ధమైన జలం రాదు. నీ హృదయమే Tank. నీ చూపే అపవిత్రము, నీ తలపులే అపవిత్రము, నీ వాక్కులే అపవిత్రములు - ఈ అపవిత్రమైన భావంతో నీ హృదయాన్ని నింపుకొని, ఏ ఇంద్రియమనే Tap త్రిప్పినా అపవిత్రమనే జలము వస్తుంది. కనుక మన హృదయమనే Tank ను పరిశుద్ధపరచి, పవిత్రమైన దృష్టితో పవిత్రమైన భావముతో నింపి, పవిత్రమైన వాక్కులతో నింపి, పవిత్రమైన సాధనలు సలిపినప్పుడే, ఇది పవిత్రమైన Tank గా రూపొందుతుంది.

శరీరమునకు గాయమైతే హాస్పిటల్‌కి వెళ్ళి కట్టుకట్టించుకొనవచ్చును. మాన్పించుకొనవచ్చును. అదే హృదయానికి తగిలే మాటల వలన ఏర్పడే గాయము మాత్రం మానదు. కనుక పరులను బాధించనటువంటి పలుకులు పలకాలి. నీలోనున్న మానవత్వాన్ని పవిత్రం గావించుకో. మానవత్వాన్ని నీవు గుర్తించినప్పుడే, దైవత్వాన్ని కూడా గుర్తించే అధికారమును పొందుతావు. నీలోనున్న సహజమైన మానవత్వాన్ని గుర్తించలేనప్పుడు దైవత్వాన్ని

## సుభాషితములు

"పరోపకారాయ ఫలన్తి వృక్షాః
పరోపకారాయ వహన్తి నద్యః
పరోపకారాయ దుహన్తి గావః
పరోపకారార్థ మిదం శరీరమ్"

పరోపకారము కొఱకు చెట్లు ఫలముల నిచ్చుచున్నవి. పరోపకారము కొఱకు నదులు ప్రవహించుచున్నవి. పరోపకారము కొఱకు ఆవులు పాలనిచ్చుచున్నవి. మన ఈ శరీరము కూడా ఇతరులకుపకారము చేయుట కొఱకేయని తెలిసికొనవలెను.

ఏ విధంగా గుర్తించగలుగుతావు? మొట్టమొదట నీలోనున్న మానవత్వాన్ని గుర్తించు. ఈ మానవత్వాన్ని సార్థకం గావించుకో. అదే సహజంగా దివ్యత్వంలో ప్రవేశిస్తుంది.

ఎంత కాలమైనా భౌతిక సుఖాల కోసం, ఆనందాల కోసం, సౌభాగ్యాల కోసం జీవితమును అంకితం చేస్తున్నారుగాని, ఆధ్యాత్మిక ఆనందం కోసమని, జ్ఞానానంద నిమిత్తమై ఏ మానవుడూ ప్రయత్నం చేయటం లేదు. ఆ నిజమైనటువంటి ఆత్మానందమును అనుభవిస్తే సర్వానందములు మనకు లభ్యమైపోతాయి. నీవు తెలుసుకున్న మంచిని ఒక్క దానినైనా నీవు ఆచరణలో పెట్టు. జీవితమంతా చదువుతూ...... చదువుతూనే..... పోతుంటే ఇంక దీనిని ఆచరణలో పెట్టేది ఎప్పుడు? ఆచరణలో పెట్టనటువంటి చదువు చదివి ప్రయోజనం ఏమిటి? ఇదంతా కాలమును వ్యర్థం చేసుకోవటమే. నీ శక్తిని వ్యర్థం గావించుకోవటమే. నీ జీవితాన్ని వ్యర్థం చేసుకోవటమే. కట్టకడపటికి చదివినవన్నీ నీ హృదయంలో నిండిపోతున్నాయి. వాటితోనే నీ ప్రాణమును వదులుతున్నావు. నీకు దైవాన్ని చింతించడానికి ఏమాత్రం అవకాశం లేకుండా పోతున్నది. లౌకికమైన, భౌతిక, ప్రాకృతమైన విషయములతోనే నీ హృదయం నిండిపోతున్నది. ఇటువంటి విషయాలు స్వామి పిల్లలకు చెబుతున్నాడే! వారి గతి ఏమవుతుంది? అని కొందరనుకుంటుంటారు. కాని ఆ యువతలోనే ఇవన్నీ ప్రవేశపెట్టాలి. Start Early, Drive Slowly, Reach Safely. ఈ వయస్సులోనే మంచి భావాలు వారికి అందించాలి. వారు కష్టపడతారని వారికి మంచి భావాలను అందించలేకపోతే, వారు పాడైపోతారు. తరువాత ఏడ్చి ఏమి ప్రయోజనం? కనుక మొట్టమొదటి నుంచే జాగ్రత్త వహించాలి.

మానవత్వమునకు ఉండినంత పవిత్రత దేనికీలేదు. చూడండి! సింహం వేషం వేశారు. ఆకారమంతా సింహమే. కాని లోపల ఉండి ఆడినవాడు మానవుడే. కనుక మానవత్వం ప్రధానంగాని, ఈ ఆకారం ప్రధానం కాదు. అదే విధంగా దేహమనేటటువంటిది మానవ ఆకారముగా ఉంటున్నది. ఆకారము మనకు ప్రధానం కాదు. ఆచరణ ముఖ్యం. అదే మానవతా విలువ (Human Quality) మానవుడుగా ఉండి మానవత్వపు విలువలు లేకపోతే ప్రయోజనం ఏమిటి? మానవతా విలువలు పెంచుకోవాలి.

ఏమిటి ఈ మానవతా విలువలు? మంచి దృష్టి, మంచి ఆలోచనలు, మంచి వాక్కు, మంచి కర్మలు, మంచి జీవితం - ఇదే మంచి మానవతా జీవితం. అప్పుడే పూర్ణ మానవుడిగా తయారౌతావు. ఎప్పుడు చూచినా భగవత్ చింతన చేస్తుంటారు కొందరు. చింతన చేసి ప్రయోజనం ఏమిటి? దానికి తగిన ఆచరణ పెడుతున్నారా? లేదు. లేనప్పుడు ఎన్ని చింతనలు చేసి ప్రయోజనం ఏమిటి? కేవలం రాం......రాం......... సాయి.........సాయి........... అని చింతన చేస్తే ప్రయోజనం ఏమిటి? టేప్‌రికార్డర్ కూడా అదే విధంగా చింతన చేస్తుంది. అదికాదు. ఆ చెప్పిన నామం హృదయంలో నాటుకుని పోవాలి. అపుడు ఆ హృదయం నుంచే మంచి భావాలు మనలో ప్రవేశిస్తాయి. అవే వృక్షములుగా మారుతాయి. అవే ఫలములుగా మనకు అందిస్తాయి. అసలు మంచి భావాలు హృదయంలో మాత్రమే పుడుతాయిగాని, మరో ప్రదేశంలో కాదు. మన హృదయమనే భూమి లోపల సద్భావనలు, సచ్ఛింతనలు, సత్ప్రవర్తన అనే విత్తనాలు నాటినప్పుడే అందులో వృక్షములు పుడుతుంటాయి. మనలో మంచి ఆలోచనలు రావటానికి ఏమిటి కారణం? అట్టి విత్తనములను పాతాలి. ఆ విత్తనములు ఎక్కడ ఉంటున్నాయి? 'సమ్యక్ దర్శనం'! మంచి చూపువలన వస్తున్నాయి ఆ విత్తనములు. అప్పుడే 'సమ్యక్ భావం' మంచి భావములు మనలో పుడుతున్నాయి. అవే 'సమ్యక్ వచనం' మంచి మాటలుగా మారుతున్నాయి. అవే 'సమ్యక్ కర్మ' మంచి కర్మలుగా మారుతున్నాయి. అవే 'సమ్యక్ సాధనలు'గా రూపొందుతున్నాయి. అవే ఆఖరికి 'సమ్యక్ జీవనం'గా మారుతున్నది. ప్రతి మానవుడు ఈనాడు సాధించవలసింది 'సమ్యక్ జీవనం' ఈ సమ్యక్ జీవనానికి, సమ్యక్ దృష్టి చాలా అవసరం. కనుక మనం దేనిని పడితే దానిని చూడటానికి ప్రయత్నించకూడదు. ఎవరినా చూడాలో వారిని మాత్రమే చూడాలి. ఎవరితో మాట్లాడాలో వారితో మాత్రమే మాట్లాడాలి. అనవసరంగా

అందరితో మాట్లాడుతే ఆ భావములు మనలో ప్రవేశిస్తాయి. 'యద్భావం తద్భవతి'. అవే నీలో రూపొందుతాయి. కనుక ఎవరిని పడితే వారిని చూడకూడదు. ఎవరితో పడితే వారితే మాట్లాడకూడదు. అట్టి భావములను సరియైన దృష్టిలోనికి తీసుకున్నపుడు, మనం సమ్యక్ జీవితాన్ని గడుప గలుగుతాం.

నిర్వాణం పొందే సమయంలోపల ఒక విషయాన్ని గుర్తించాడు బుద్ధుడు. చదివిన చదువుల వలన, పఠించిన గ్రంధాల వలన, వినిన భోధనల వలన జ్ఞానం లభించదని గ్రహించాడు. ఇవి గ్రంధపరిచయంతో వచ్చిన తెలివితేటలే గాని, నిజంగా మన హృదయం నుంచి ఆవిర్భవించి నటువంటివి కావని గ్రహించి బుద్ధగయకు వెళ్లాడు. అక్కడ మర్రివృక్షం క్రింద కూర్చున్నాడు. తన దృష్టిని పవిత్రమైన దానిగా మార్చుకున్నాడు. దాని వలన అతనిలోపల నుంచి మంచి భావాలు రానారంభించాయి. ఆ మంచి భావాలు

ఏ పూర్వ జన్మ సుకృతమో
మాతా, పితరుల పుణ్య ఫలమో
నేటికి చేరితినే పర్తికిన్
కన్నులారగగాంచితి సాయిరూపమున్
విశ్వమునకు పాలించు..విశ్వేశ్వరుండితడు
ఈశ్వరాంబసుతుడై ఉద్భవించెనిట
ఏమి పుణ్యంబు, పండెనో అఖిలాంధ్ర ప్రజకు
అలవైకుంఠవాసుడే తరలివచ్చు
సాధు సజ్జనుల మొరనాలకించి
వేద ధర్మంబులనిల ఉద్ధరించ
సమత, మమతల రూపమే సర్వమతమ్ములని
దేశ, దేశాల ప్రజలకు చాటి చెప్పె
సత్య, ధర్మ, శాంతి, ప్రేమావతార
సత్యసాయి నీకివే వందనములు.
శతకోటి వందనములు.

సదా సాయిసేవలో
కట్టోజు కృష్ణమోహన్

రావటం చేత మంచి పలుకులు పలుకుతూ వచ్చాడు. ఆ మంచి పలుకులచేతనే సర్వులనూ ఆకట్టుకున్నాడు. యువకులందరూ బుద్ధుని వెంబడించారు.

అన్నింటికి దృష్టిప్రధానం. ఉదాహరణకు సైకిలు మీద వెళ్ళే విద్యార్థి దృష్టి రోడ్డు మీద ఉండాలి. ఆ విధంగా లేకుండా రోడ్డు ప్రక్కలనున్న సినిమా పోష్టర్సును చూచుకుంటూ సైకిలు త్రొక్కుతుంటే యాక్సిడెంటు అవుతుంది. కన్నులు యిచ్చింది తుచ్ఛమైన దృశ్యములను చూడటానికి కాదు. దీనివలన భావములు అపవిత్రము లౌతాయి. ఈ విధంగా బుద్ధుడు తన శిష్యులకు బోధిస్తూ కఠినమైన శిక్షలు యిస్తూ చక్కటి సాధనలను నేర్పుతూ, సక్రమమైన వారిగా తయారు చేశాడు. సమ్యక్ దృష్టి చేత, సమ్యక్ జీవనం గడుపుతూ, సమ్యక్ సమాధిని పొందాడు. దానినే 'సమ్యక్ నిర్మాణం' అన్నారు. కనుక మనం కూడా దృష్టిని చక్కదిద్దుకుంటే మన ఆఖరి దశ సమ్యక్ నిర్వాణమే.

**స్వదేశీయులారా! విదేశీయులారా!**

మొట్టమొదట ఎవరైనా సరే మానవాకారము ధరించినప్పుడు మనమంతా మానవతా విలువలను పెంచుకోవలసిందే. సత్య సాయి సంస్థలలో మానవతా విలువలకు అత్యంతమైన ప్రముఖ స్థానం యివ్వబడింది. ఈ మానవతా విలువలు పెంచుకొనినప్పుడు దివ్యభావాలు మనలో ఆవిర్భవిస్తాయి. "కన్నులుంటున్నాయి ప్రతి మానవునికి. కాని అందరూ భగవంతుని చూడటం లేదు. అలాంటివారు గుడ్డివారుగానే పుట్టటం మంచిది." అన్నాడు సూరదాసు. ఏమిటి ఈ జీవితం? ఈ తుచ్ఛమైన ఇంద్రియములను అనుభవించడానికా? ఇంద్రియములను కూడా సక్రమమైన మార్గంలో అనుభవించాలి. సరియైన దివ్యత్వంలో అనుభవించాలి. కుక్కలు, నక్కలు అనుభవించినట్లుగా అనుభవించి, ఇటువంటి జీవితం 'మానవుడు' అని ఏమి ప్రయోజనం? ఇట్టి మానవుడు ఎంతో చదువులు చదివి ప్రయోజనమేమిటి? ఇవన్నీ కేవలం ధనము నార్జించే నిమిత్తమై చదివే చదువులు. దీని వలన మనకు జ్ఞానం ఏనాటికీ లభ్యంకాదు. మనకు జ్ఞానం కావాలంటే ఇంద్రియాలను పవిత్రం గావించుకోవాలి. అన్ని

ఇంద్రియములలో 'దృష్టి' చాలా ప్రధానమైనటువంటిది. కన్నులు పవిత్రమైన దివ్యత్వాన్ని చూడాలి. ఆ దివ్యత్వం నీలో లేకపోతే, కన్నులు మూసుకుని దానిని నీలో చిత్రించుకో. ఆ విధమైన పవిత్రభావనలు పెంచుకుంటూ పోవాలి. ధనమును ఎంతైనా సంపాదించవచ్చును కాని, అది ఏ నాటికీ మన వెంటరాదు.

కౌరవులు కావల్సినంత ధనమును ఖజానాల్లో నింపుకున్నారు. పాండవుల చేతిలో ఒక కాసు కూడా లేదు. అడవిలో సంచరిస్తూ ఆకులలములు తింటూ కాలం గడిపారు. కాని కట్టకడపటికి ఏమైంది పాండవులకు కృష్ణుడు ప్రాప్తించాడు. కౌరవులకు పాపం ఫలించింది. ఎంత ధనముండి ఏమి ప్రయోజనం ధనం పైన పడుకొని నప్పటికినీ, ధృతరాష్ట్రునికి అగ్ని పర్వతంపై పడుకున్నట్లుగా ఉంది. హంసతూలికా పానుపు అగ్ని గుండంగా మారిపోయింది. పాండవులు అరణ్యంలో జీవిస్తూ వచ్చారు. హాయిగా జీవితాన్ని గడుపుతూ వచ్చారు. ఏమిటి ఆ హాయి జీవితం? కృష్ణ నామమే హాయి జీవితం? పాండవులకు, కౌరవులకు ఉండిన వ్యత్యాసమేమిటో గుర్తించాలి. పాండవులకు మొదట God (దేవుడు) తరువాత World (ప్రపంచం), ఆఖరు I (నేను), కౌరవులను మొదట I (నేను), తరువాత World (ప్రపంచం), ఆఖరు God (దేవుడు). అందువలననే కౌరవులు సర్వనాశనం అయిపోయినారు. మొట్టమొదట మనకు దైవం కావాలి. దైవము లేకుండా ఎన్ని ఉండి ఏమి ప్రయోజనం? Money comes and goes, but Morality comes and grows. ఆ Morality లేనప్పుడు ఈ Money ఉండి ప్రయోజనం ఏమిటి? ఈ దేహముండి ప్రయోజనం ఏమిటి?

"మల మూత్రదుర్గంధ మాంస రక్తమెగాని
పునుగు జవ్వాజులు పుట్టబోవు
నిముష నిముషమునకు నీచులూరునెకాని
పునుగు జవ్వాజులు పుట్టబోవు"

ఏమిటి ఈ దేహం? మలమూత్ర దుర్గంధ మాంసరక్తములతో కూడినటువంటిదే. ఈ మాంస రక్తముతో కూడినటువంటి దానికి, ఇంకొక మాంసరక్తం ఎందుకు? దీనిని నీవు సార్థకం చేసుకో! దీనిని నీవు పవిత్రం చేసుకో! దీనితో నీకు సరియైనటువంటి జన్మను అనుభవించు. అంతే కాని ఎదో ఒక మార్గంలో ప్రవేశించి, జీవితాన్ని ఆనందమయంగా గడుపుదామనుకోవటం చాలా వెర్రితనం. పిన్న తల్లి గౌతమి కుమారుడైన ఆనంద్‌ను పిలిచి "ఎందుకోసం ఏడుస్తున్నావు నాయనా!" అని అడిగాడు బుద్ధుడు. "అన్నా! మీరు దేహాన్ని వదిలే పరిస్థితి వచ్చింది. దానిని నేను దూరం చేసుకుంటున్నానే!" అని ఏడుస్తున్నాను అన్నాడు ఆనంద్. "పిచ్చివాడా! ఈ దేహం నీటి బుడగ వంటిది. మనసు పిచ్చి కోతివంటిది. కనుక ఈ దేహమును అనుసరించవద్దు. ఈ మనసును అనుసరించవద్దు. నీ హృదయాన్ని అనుసరించు. ఈ తుచ్ఛమైన దేహం కోసం ఎందుకు విచారిస్తావు? ఈ కోతివంటి మనసు కోసం ఎందుకు విచారిస్తావ్? కనుక నీ హృదయమును భద్రం చేసుకో!" అని చెప్పాడు, కన్నుమూశాడు.

పవిత్ర మహనీయులుగన్న భూమి భరత భూమి. ఇటువంటి పవిత్రత మరే భూమి యందు కనిపించటంలేదు. ఇక్కడి స్త్రీలుగాని, పురుషులుగాని పవిత్రమైన కర్మల నాచరించి, పవిత్రమైన మార్గాన్ని బోధిస్తూ వచ్చారు. అటువంటి పవిత్రమైన మహనీయులు పుట్టిన భూమి ఈ భరతభూమి.

"విరత సత్య ప్రౌఢి ధరణి నేలిన హరి
శ్చంద్రుడీ ధర బాసి చనగలేదే॥
ఎల్లలోకములేలి ఎసగు శ్రీ నలరాజు
తన వెంట భూమిని గొనుచు చనెనె
కృతయుగంబు నలకృతిని చేయు మాంధాత
సిరిమూట గట్టుగ అరిగి నాడె
అలనాటి శ్రీరాముడు ఆకు లలములు మేసి
తనవెంట ధర్మమును గొంచు చనెనె"

తన ధర్మాన్నంతా ప్రజలకే బోధిస్తూ వచ్చాడు. కనుకనే "రామో విగ్రహవాన్ ధర్మః" అన్నారు. అట్టి ధర్మ స్వరూపులైన మహనీయులు ధర్మాన్నే ప్రబోధిస్తూ వచ్చారు. సత్య స్వరూపులైన మహనీయులు సత్యాన్నే ప్రబోధిస్తు

వచ్చారు. సత్య స్వరూపులైన మహనీయులు సత్యాన్నే బోధిస్తూ వచ్చారు.

ఈనాడు క్రొత్త సంవత్సరం New Year (చైనా వారిది) భగవంతునికి 'సంవత్సరుడు' అని పేరు. కనుక మనం క్రొత్త సంవత్సరంగా భావించుకోవటం కాదు, క్రొత్త భగవత్ స్వరూపంగా మనం భావించుకోవాలి. New Divinity ని వదిలి పెట్టుకొని, ఇది క్రొత్త సంవత్సరమే అనుకొని ఎన్ని అలంకారాలు, ఎన్ని పిండివంటలు చేసుకొనినప్పటికిని ఇది New Year కాదు. పిండివంటలు చేసుకోవటాని కోసం New Year రాలేదు. New Ideal (న్యూ ఐడియల్) మనం తీసుకొని రావాలి. లోకంలో ఎంతమంది ఎన్ని సాధనలు చేశారు. వారంతా ఏమి శాంతిని పొందారు? ఈనాడు మనం శాంతిని పొందటానికి ప్రయత్నించాలి. ఈ శాంతి మనలో లేనప్పుడు ఎన్ని ప్రయత్నాలు చేసి ఏమి ప్రయోజనం? ఈ శాంతి మనకు చక్కటి దృష్టి వలన లభిస్తుంది. అదియే సమ్యక్ దృష్టి. ఆ దృష్టిలోనున్న పవిత్రత మరిదేనిలో కూడా మనకు ప్రాప్తించదు.

ప్రేమ స్వరూపులారా!

మానవుడు చేసే పనులు ఐదు రకములు. 1. తాను చేసే పనులు ఆచరించి చేసి చూపిస్తాడు. వీడు ఉత్తముడు. 2. తన చేతులతో చేస్తాడు. వీడు మధ్యముడు. 3. భుజబలంతో చేస్తాడు పనులు. ఈ పనులు నీచమైనవి. 4. అహంకారబలంతో చేస్తాడు పనులు, అతినీచాతి నీచమైనది. 5. ఇతరుల మెప్పుకోసం, షో కోసం చేస్తాడు. అవి మరింత నీచమైనవి. కనుక మనం చేసే ప్రతి పనులు హృదయంతో చేయాలి. హృదయంతో చేసిన పనులే సత్యమైనవి, నిత్యమైనవి. ఏ చింత చేసినా హృదయంతో చేయి. అది పవిత్రమైనదిగా రూపొందుతుంది. హృదయం ఎప్పుడూ పవిత్రమైనదే. మధ్యలో మేఘాలు (Clouds) వస్తూపోతుంటాయి. అన్నిటికీ మించి ఉన్నతస్థాయిలో ఉన్నది ఆకాశం. అది నిశ్శబ్దం. కనుకనే "ఆకాశం గగనం శూన్యం" అన్నారు. దాంట్లో కూడా కొంత శబ్దం ఉన్నది. శబ్దమన్నది కాబట్టి అది దైవం కాదన్నారు. బుద్ధుడు కూడా కైలాసం దేవుడు కాదన్నాడు. ఏది దైవం? శబ్దమునకు అతీతమైనటువంటిది దైవము అన్నారు. కనుక మనం ఇష్టం వచ్చినట్లు మాట్లాడకూడదు. ఇష్టం వచ్చినట్లు ఎవరితో పడితే వారితో పెద్దగా మాట్లాడి మనలోనున్న వైబ్రేషన్స్ వ్యర్థం చేసుకోరాదు, మనలోనున్న వాక్ శబ్దాన్ని అపవిత్రం గావించుకోరాదు. మీతో చెప్పేముందు ఆచరించి చేయాలనే సంకల్పంతో ఈ జనవరి 1వ తేదీ నుంచి నేను ఎక్కువగా మాట్లాడటంలేదు. అవసరమొచ్చినంత వరకే మాట్లాడుతున్నాను. కోర్కెల రూములోనికి వచ్చినప్పుడు వారికి అవసరమైన విషయాలను మాత్రమే చెబుతున్నాను. ఊరికే అందరితో మాట్లాడటం లేదు. ఎందుకోసం? ఆచరించి చెప్పినప్పుడే దానికి విలువ వుంటుంది. నేను మీకు చెప్పినప్పుడు, నేను చేసి చూపించాలి. My Life is My Message (నా జీవితమే నా సందేశం). కనుక మనం ఈనాటి నుంచి మన దృష్టిని అదుపులో పెట్టుకోవాలి. మంచిని మాత్రమే చూడండి.

కన్నులు పోయినాయి. కనిపించటంలేదు. ఇది కూడా నా మంచి కోసమేనని భావించు. చెవుడు వచ్చిందనుకోండి. నాకేమీ వినపడటంలేదని బాధపడవద్దు.

అసలు ఈ ప్రపంచంలో వినదగ్గవేమున్నాయి? వీళ్ళను వాళ్ళు, వాళ్ళను వీళ్ళు తిట్టుకోవటమా వినటం. ఈ చెడ్డ విషయాలన్నీ నాకు వినిపించటంలేదు. ఇది నా మంచికేనని భావించు. ఏది జరిగినా భగవంతుని యొక్క వర ప్రసాదంగానే భావించు. అన్నీ మన జీవితానికి మంచిగానే వచ్చాయని విశ్వసించు. అంతయూ మన మేలు కొరకేనని విశ్వసించాలి.

మలేషియా, సింగపూర్, హాంకాంగ్, చైనా, జపాన్, తైవాన్ మరి ఎంతో దూర ప్రాంతముల నుంచి ఎన్నో కష్టాలు పడి, బాధలు పడి యిక్కడకు వచ్చారు. ఆ కష్టాలు, బాధలు, విచారములు అన్నీ యిక్కడ వదలి, ఆనందాన్ని హృదయాలలో నింపుకుని వెళ్ళండి. మీలో ఉన్న దుర్భావనలు, దుశ్చింతనలు యిక్కడ వదలిపెట్టండి. ఈ ప్రశాంతిని మీ హృదయంలో నింపుకొని వెళ్ళండి. అశాంతితో వచ్చి అశాంతితోనే పోకూడదు. ప్రశాంతి మానవునికి ప్రధానమైన ప్రాణం. కాని ఈనాడు లోకములో 'ప్రశాంతి' అనేది ఎక్కడా కనిపించటంలేదు. శాంతి అనేది ప్రపంచంలో ఎక్కడాలేదు. 'శాంతి' అనేది 'ప్రశాంతి నిలయం'లో మాత్రమేనున్నది. దానిని మీరు అందుకొని పొండి! అనేక మంది ఉత్తమ భక్తులు జీవించినటువంటి ప్రదేశం ఇది. దివ్యమైన భావాలతో జీవించినటువంటి ప్రదేశం ఇది. అందువలన వారి ఉత్తమ భావాలను మీ హృదయాలలో నింపుకోవాలి. ఎవరేమైనా అనుకోనివ్వండి! వాటిని మీరు లక్ష్యపెట్టవద్దు. ఎవరో అనుకున్నారని వాటిని 'కేర్' చేస్తే, మన గతమైపోతుంది. కనుక మన దానిని మనం సంపాదించుకోవాలి. మొట్టమొదట నీ ఆత్మ విశ్వాసాన్ని Self Confidence) అభివృద్ధి పరచుకోవాలి. అట్టి ఆత్మ విశ్వాసమువలలనే నీలో తగిన ఆనంద ప్రాప్తిస్తుంది. కష్టములు వస్తుంటాయి, పోతుంటాయి. అవి కదిలే మేఘాలవంటివి. వాటిని గురించి Worry కావద్దు. Don't worry about those passing clouds, think about God only. (కదిలేపోయే మేఘాలలాంటి కష్టములను గురించి విచారించవద్దు, దేవుని గురించి మాత్రమే విచారించు.) అదియే జీవితానికి ప్రధానమైనటువంటిది. దానికి మించినది జగత్తులో మరొకటి లేనేలేదు. ఒకవేళ 'వాల్యుబుల్' అయిన 'డైమండ్' ఉంటే ఉండవచ్చునుగాని, 'శాంతి'కి మించినది మాత్రం వేరొకటిలేదు. శాంతిలేని వానికి ఎంత ఖరీదైన 'డైమండ్' యిచ్చి ఏం ప్రయోజనం? ఇవన్నీ అనిత్యము, అసత్యములు. నిత్య సత్యమైనటువంటి దివ్యత్వమైన దైవత్వాన్ని చింతిస్తూ రావాలి, దైవ ప్రేమను పొందాలి. దానికి మించినదిలేదు. Love is God, Live in Love .అదే నీ యొక్క జీవితం. The best way to Love God, is to Love All Serve All. అందరూ దైవ స్వరూపులే. కనుక అందరినీ మనం ప్రేమించాలి. అతను నిన్ను ప్రేమించినా ప్రేమించకపోయినా, నీవు మాత్రం అతనిని ప్రేమించు. కారణమేమిటి? అతనిలో కూడా దైవత్వం ఉంటున్నది. దైవములేనటువంటి ప్రదేశమే లేదు, దైవములేని ప్రాణే లేదు. కనుక దైవాన్ని చింతిస్తుంటే, పర్వతాలవలె వచ్చే కష్టాలు కూడా మంచు వలె మటుమాయమై పోతాయి.

మంచి జీవితాన్ని అనుభవిస్తున్నామని కొందరు అనుకుంటుంటారు. ఏమిటా జీవితం? కావల్సినంత ధనం ఉన్నది, పెద్ద భవనాలు ఉన్నాయి, పరిచారికలున్నారు. వంటవాళ్ళు ఉన్నారు - నాకేమి కష్టమూ లేదు, సుఖంగా ఉన్నాను అనుకుంటాడు. భౌతిక సుఖము ఒక సుఖమేనా? Happiness is the Union with God. దైవముతో కూడానటువంటి జీవితమే నిజమైన ఆనందముగాని, ఈ భౌతిక సుఖ సంతోషాలతో కూడినటువంటిది కాదు. ఈ భౌతిక ఆనందాలు సుఖాలు పెరగడంతోపాటు అంత అశాంతి కూడా పెరుగుతున్నది. అది నీవు గుర్తించడం లేదు.

ప్రేమను పెంచుకోండి! సత్యమును పలకండి! ధర్మాన్ని ఆచరించండి! శాంతిని పొందండి! ఇదే స్వామి యొక్క ఈనాటి ప్రత్యేకమైన ఆశీర్వాదము.

మీరు ఎక్కడకు వెళ్ళినా ప్రశాంతంగా, ప్రియంగా మాట్లాడండి. ఆ విధంగా మాట్లాడినప్పుడు మీలో మంచి భావాలు అభివృద్ధి అవుతాయి. అప్పుడు సమాజమే నిన్ను మంచివాడిగా భావిస్తుంది. మంచి పేరును పొందండి. ఇదే మీరు తీసుకొని వెళ్ళదగిన నూతన సంవత్సర

బహుమానం. మీరు నాకు చాలా Gifts యిచ్చినట్లుగా భావిస్తున్నారు. ఇందులో Tiger Map ఒకటి. అది నాకు కాదు యివ్వవలసిన Gift మీలో నున్న గుణాలను నాకు ఇవ్వండి. క్రూరమృగము యొక్క క్రూర గుణాలను నాకు యిచ్చి, పవిత్రమైన సాధుజంతుమైన గోవు గుణాలు మీరు పొందండి. గోవు సాత్వికమైనది. మనం వేసే పనికి రాని గడ్డిని తింటుంది. మధురమైన, మంచి ప్రొటీన్సుగల, పవిత్రమైన పాలను మనకు యిస్తుంది. చెడ్డను తిని మంచిని అందించడమే గోవు యొక్క గుణం. అందువలననే దానిని గోమాత అన్నారు. ఆవు పేరును భూమికి కూడా పెట్టారు. 'భూమాత' అన్నారు. భూమాత అంటే ఆవే. ఇలాంటి పవిత్రమైన భావాలు మీరు తీసుకోవాలి.

ప్రేమ స్వరూపులారా!

మీరు ఎంతో దూరంనుంచి, ఎన్నో శ్రమల కోర్చి యిక్కడకు వచ్చారు. ఇక్కడ నుంచి ఆనందమయమైన హృదయాన్ని తీసుకునిపోయి, మీ గ్రామాల లోపల సర్వులకు దీనిని ప్రచారం చేసి పంచుతూ రావాలి. మీరు యిక్కడ పొందిన ఆనందమును మీరు మాత్రమే అనుభవించకూడదు. అది స్వార్థమైపోతుంది. పదిమందికీ పంచినప్పుడే నిస్వార్థమౌతుంది. నేను విన్నాను గదా! చాలునని, ఎవరికీ అందించకుండా స్వార్థంతో ప్రవర్తించ కూడదు. Fish is better than selfish. చేప నీళ్ళలో నున్న మాలిన్యమును తిని నీటిని శుభ్రం చేస్తుంది. కాని ఈనాటి మానవుడు సమాజంలో ప్రవేశించి, తనలోనున్న చెడ్డనంతా సమాజమునకు అందించి, సమాజమును మాలిన్యం చేస్తున్నాడు. అట్లా చేయకూడదు. నిస్వార్థమైన ప్రేమతో మీరు అభివృద్ధి చెందాలి. కనుక ఈనాడు మనం నేర్చుకోవలసినది selfless Love selfish love కాదు. ఈ selfless Love (నిస్వార్థమైన ప్రేమతో) తో మీ జీవితాన్ని గడుపుతున్నప్పుడు, అదే నిర్మాణమైన పవిత్రస్థితిని పొందుతుంది.

మీరు భజనలు చేసారు. ఆ భజనలు వింటుంటే హృదయానికి ఎంతో ఆనందం కలిగింది. ఆ భజనలలో ఉండే ఆనందం మరొక దానిలో మనకు ప్రాప్తించదు. ఇది సమిష్టి భజన. అనేకమంది ఏకమై పాడేటటువంటిది. దీనిలో selfish అనేదే లేదు. ఈ ఆనందముతో వచ్చిన 'వైబ్రేషన్' జగత్తంతా కూడనూ పరిశుద్ధ పరుస్తుంది. కొంతమంది భజనలో కూర్చుంటారు. కాని నోరు కూడా కదపరు. నోరు యిచ్చినందుకు భగవత్‌నామాన్ని చెప్పండి. నీవు చెప్పలేక పోయినా, ఎవరో చెబుతుంటే దానిని విని పలకండి! అదియే నిజమైన భజన.

(ది. 6-2-1998 న చైనా వారి నూతన సంవత్సర మహోత్సవాలలో, సాయి కుల్వంత్‌లో భగవాన్ సాయి చేసిన దివ్య ప్రసంగము నుండి)

## రంధ్రాన్వేషణ

రాజుకు పెండ్లి జరిగింది. రాజకుమారి భర్త తన గురువైన ఒక బ్రాహ్మణుని ద్వారా కానుకలు వాటితో పాటు ఒక అందమైన బొమ్మ పంపించింది. ఆ గురువు రాజకుమారి మాటలు రాజుకు చెప్పి కానుకలు, బొమ్మ అందజేశాడు. రాజకుమార్తె తనను పొగడుతూ పలికిన పలుకులకు రాజు ఆనందభరితుడయ్యాడు. కాని మంత్రి ఆలోచనలో పడ్డాడు. అతని ముఖతీవ్రతను జూచి రాజు"ఈ ఆనంద సమయంలో తమరు ఇలా ఉండుటకు గల కారణమేమిటి? అన్నాడు. "ఆ గురువు చెప్పిన రాజకుమారి పలుకులలో రంధ్రాన్వేషణలో దిట్టలు గ్రహించమన్నది. అందులో ఏదో రహస్యం ఉండి ఉంటుంది" అన్నాడు మంత్రి. రాజుకు ఏమీ అర్థం కాలేదు. మంత్రి ఆ బొమ్మని నిశితంగా పరిశీలిస్తే దానికి అడుగున ఒక మీట ఉంది. అది నొక్కితే బొమ్మకి రంధ్రము ఏర్పడి ఒక ఉత్తరం కనిపించింది. పడక గదిలో మంచం రాజుకు ప్రమాదకరంగా ఏర్పాటు చెయ్యబడినట్లు ఉంది. ఆ రాజు కృష్ణదేవరాయలు. మంత్రి అప్పాజీ. జరిగిన వివాహం శత్రువు గజపతి కూతురుతో. మంత్రి తిమ్మరుసు రాయలను ఉపాయంతో ఆ ప్రమాదం నుండి తప్పించి శత్రురాజును బంధింపజేశాడు. ఇటువంటి క్లిష్టసమయాలలో మంత్రుల బుద్ధి కుశలత వల్ల నాడు రాజులతోబాటు రాజ్యాలు రక్షించ బడుతూ వచ్చాయి. ఇటువంటి వారు పవిత్రతకు గుర్తింపుగా నిలిచారు. నేడు సమాజంలోఇటువంటి అంకితభావంతో ఉండేవారు అన్నిరంగాలలోను కావాలి.

- ఎన్.వి.ఆర్. సత్యనారాయణ మూర్తి

ఆర్.ఎస్.కె. స్మారక వ్యాస రచన పోటీలలో ద్వితీయ బహుమతి పొందిన వ్యాసం

# యువతకు సరియైన విద్య

విద్యలో భారతీయత్వపు తేజాన్ని నింపాలనే ఉజ్వలాశయంతో దేశమంతటా వందలాది విద్యా సంస్థలు, సమాజాలు ఆవిర్భవించాయి. చదువుతున్న యువతీ యువకులు విద్యా ప్రమాణాలలోనే కాక సంస్కార వంతమైన, అనుశాసనబద్ధమైన ప్రవర్తనలో కూడా సాధారణ స్థాయి కంటే ఎంతో ఉన్నత స్థాయిలో మెలగాలి.

"విద్యా వినయేన శోభతే"

విద్య ద్వారా వినయం శోభిల్లుతుంది. వినయం ద్వారా ఉచ్ఛస్థితి పెంపొందించుకోవచ్చును. బాల్య దశలో ఇవి పట్టుబడతాయి. అప్పుడే విద్యను అలవరుచుకోవాలి. ఆ విద్యే జీవితాంతం గుర్తుంటుంది. బాల్య దశను సద్వినియోగము అయ్యేటట్లు చూడాలి. ముఖ్యంగా తల్లిదండ్రులు, గురువులు ఈ గురుతర బాధ్యత స్వీకరించాలి. సమాజ శ్రేయస్సుకు సర్వస్వాన్ని సమర్పించిన, నిస్వార్థ త్యాగుల దివ్య చరిత్రను విద్యాలయాలలో యువతకు పెంపొందించేందుకు దోహదపడుతుంది.

స్వాతంత్ర్యం వచ్చి 50సం॥లు నిండినా, చదువుకొన్న యువతీ, యువకులలో నైతిక విలువలు దిగజారి పోతున్నాయి. అదివారి పొరపాటు కాదు, దీనికి తల్లిదండ్రులు, గురువులు ఎంత బాధ్యులో మనలని పాలించే ప్రభుత్వాలకు కూడా అంతే బాధ్యత. ముఖ్యంగా స్వరాజ్యం తరువాత కూడా ఆంగ్ల విద్యా విధానానికి ప్రభుత్వం స్వస్తి చెప్పలేకపోయింది. విద్యా రంగములో విప్లవాత్మకమైన మార్పులు తీసుకురావాలి. అప్పుడే యువత సరైన మార్గంలో పయనిస్తుంది. విద్యారంగములో మార్పులు రావాలని విజ్ఞులు ఏనాటినుంచో భావిస్తూనే ఉన్నారు. అయితే అవి కలలుగానే మిగిలిపోయాయి.

ఇంకా విద్యను పెంపొందించాలంటే కనీసం భావితరాల వారినైనా సరైన భారతీయ పౌరులుగా తీర్చిదిద్దాలంటే అన్ని స్థాయిలలోనూ ముఖ్యంగా ప్రాథమిక స్థాయిలో భారతీయ విద్యను ప్రవేశ పెట్టాలి.

"సర్వద్రవ్యేషు విద్యైవ, ద్రవమహూరనుత్తమమ్
ఆహార్యత్వా దనర్ఘత్వా, దక్షయాత్వాచ్చసర్వదా"

**విజ్ఞానం**

సుసంపన్నమైన సంస్కృతి సంప్రదాయాలను తెలిసికోవాలన్నా, యువత ప్రపంచములోని ప్రకృతి శోభ చూడవలెనన్నా, విజ్ఞానము సాధించిన ఘన విజయాలు అర్థం చేసుకోవాలన్నా, శాస్త్రీయ దృష్టి అవసరం. శాస్త్రీయ లేని వారు చదువుకొన్నవారు అనిపించుకోరు.

## బండ్రెడ్డి రాముడు

వాతావరణ కాలుష్యం, ఆధునిక యుద్ధ తంత్రములు, అన్నిటికిమించి భూతలం మీద మానవుని ఉనికి యిత్యాది సమస్యలు విజ్ఞానం మీద ఆధారపడి ఉన్నాయి. కాబట్టి యువతకు విజ్ఞానము పెంపొందించ వలసిన అవసరం ఎంతైనా ఉంది.

మానవ జాతికి అన్ని రంగాలలోనూ, శాస్త్రీయ జ్ఞానం అవసరమే. వైజ్ఞానిక దృష్టి కలిగిన రాజకీయ, వ్యాపార, కళా రంగాలలో ముందుకు వెళ్ళూతూ ఉందంటే అందుకు వైజ్ఞానమే కారణం. విజ్ఞాన శాస్త్రము ఎంత ముఖ్యమైనా దానిని శాస్త్రవేత్తలకే వదలకూడదు. శాస్త్రవేత్తలు ఎంతటి ప్రముఖులైనా విజ్ఞాన శాస్త్రాన్నే అంటిపెట్టుకుని ఉండకూడదు. శాస్త్రీయ దృష్టి కలిగిన సామాన్యులు కూడా శాస్త్రజ్ఞులకు సహకరించాలి. అప్పుడే మంచి ఫలితాలు పొందవచ్చు. ఇంకనూ చెప్పాలంటే విజ్ఞానం అనేది ఎదుటి వ్యక్తితో ఖచ్చితంగా, సంక్షిప్తంగా, సూటిగా వ్యవహరించుట తెలుపుతుంది. సహేతుక దృష్టితో మెలగాలి.

ఆధునిక మానవుడు వేగాన్ని కోరుతున్నాడు, సాధిస్తున్నాడు. జయిస్తున్నాడు. మన దేశం వ్యవసాయక దేశం. ఇక్కడ అనేక వనరులు చమురు, సహజవాయువులు,

పశు సంపద, నదీనదాలు, అడవులు మొ॥నవి ఉన్నాయి. అయితే వాటి వరకు మానవుని అవసరాలకు ఉపయోగ పడుతుంది. అంటే దానిని గూర్చి మన శాస్త్రజ్ఞులు ఇంకనూ పరిశోధనలు వల్ల, కొంత ప్రకృతి వినాశనానికి దారి తీస్తుంది.

**క్రమశిక్షణ :**

మానవుడు పుట్టుకతో దేనినీ సాధించలేడు. అయితే బాల్య దశలో ముఖ్యంగా ఏవైతే రాణిస్తాడో, వాటినే తరువాత కాలంలో ఆచరణలో చూపగలడు. ముఖ్యంగా మనిషికి నాలుగు దశలు ఉంటాయి. అయితే వాటిలో ముఖ్యమైనది బాల్యదశ. ఈ దశలోనే ఉగ్గుపాలతో కన్నా ఎక్కువగా మంచి మార్గాన్నే పెంపొందించే వాతావరణాన్ని కల్పించవలెను.

"మొక్కయి వంగనిదే మానయి వంగునా?" అట్లానే బాల్యదశలో మొదట తల్లి. తరువాత గురువు. ఆ పై సమాజము ఈవిధంగా ఒక్కొక్కరు గురుస్థానములో ఉండి పిల్లలను ఉచ్ఛస్థితికి, ఉన్నత శిఖరాలకు పయనించే మార్గాన్ని చూపించవలెను.

ఈ విధముగా ఉన్నత శిఖరాలు అధిరోహించిన ప్రముఖులలో ఛత్రపతి శివాజీ, స్వామి వివేకానందుడు, శ్రీరాముడు యిత్యాది మహా పురుషులు ఉన్నారు.

ఆ తరువాత విద్యార్థి దశలో పాఠశాలలలో, విశ్వవిద్యాలయాలలోగాని నేడు నెలకొన్న క్రమశిక్షణా రాహిత్యము, ప్రాంగణ అశాంతి, ఉపాధ్యాయ విద్యార్థుల మధ్యయున్న వేర్పాటు భావము, రాజకీయాలలో ఉన్న సకల కాలుష్యాలు విద్యాలయాలలో చోటు చేసుకొని, పాతుకొని ఉన్న దౌర్భాగ్యముగాని సమసిపోవాలంటే, ప్రాధమిక స్థాయిలోనే క్రమశిక్షణ పెంపొందించే చర్యలు తీసికోవాలి.

అంతేకాక పాఠశాల యందు క్రమశిక్షణను పెంపొందించే పాఠ్యాంశాలు, క్రీడలు, కళలు మొ॥నవి భారీ ఎత్తున జరిపించాలి.

**సచ్ఛీలము :**

సమాజములో కులము - వర్గము, స్పృశ్యత - అస్పృశ్యత, పట్టణ - గ్రామీణ, ధనిక - పేద, చదువు - చదువురాని, గిరిజన - గిరిజనేతర విభేధాలన్నీ సమసిపోయి సామరస్య పూర్వకమైన హృదయాల సమైక్యతే జనియించా లంటే సచ్ఛీలము పెంపొందించుకోవాలి. ఇది ఉన్నవారు విశుద్ధ శీలవంతులు, అపార శ్రద్ధాన్వితులుగా, అసమాన అనుశాసన బద్ధులుగా పరిగణించబడతారు. సచ్ఛీలురు జాతి జీవనంలో విద్వేష స్వార్థాలను దగ్ధం చేసి, త్యాగ సేవాభావాలను పెంపొందించాలి. ఫలితంగా సమాజము పరిపూర్ణమైన శ్రద్ధా విశ్వాసాలకు ప్రతీకగా ఉంటుంది.

**శీల సంపద :**

ప్రాచీన హిందూ మహర్షులు, ద్రష్టలు ఆకాంక్షించిన జగత్కళ్యాణ కార్యం సర్వత్రా పరివ్యాపించి యున్న పరమాత్మ యొక్క ఉనికిని సకలమానవాళి చేత గుర్తింప చేసి తద్వారా సర్వమానవ సౌభ్రాతృత్వపు ఆధ్యాత్మిక బంధాన్ని పెంపొందించే కార్యం సచ్ఛీలమే. అంతేకాక మానవుని శారీరక, మానసిక, లౌకిక, ఆధ్యాత్మిక మొ॥ ఆకాంక్షలను శ్రేష్టమగు రీతిలో నెరవేర్చగలిగి దీప్తి మంతం చేసి, నేటి ఆత్మహత్యా సదృశ్యమైన భౌతిక వాదపు ఉన్మాదం నుంచి జాతిని రక్షించేదే సచ్ఛీలము.

**దేశభక్తి :**

బ్రిటీషువారు భారతదేశాన్ని పరిపాలించి, ఈ దేశ సంపదను కొల్లగొట్టి దేశాన్ని చిన్నాభిన్నం చేస్తుంటే భరతమాత దిక్కులేనిదా? అనిపిస్తుంది. అయితే ఇది యదార్థం కాదు. ఈ భరతమాత బిడ్డలు చేతకాని వారు కాదు అవసరమైతే ప్రాణత్యాగాలకు సైతం సిద్ధమై దేశభక్తిని పెంపొందించారని చెప్పవచ్చు.

ముఖ్యంగా స్వతంత్ర్యపు ఉద్యమములో మన వారు చేసిన కృషి ఫలితమే 50సం॥ భారతావని. అయితే ఇక్కడ లాఠీలు దెబ్బలు తిన్నది ఒకరు, నెత్తుటి మరకలు మరొకరివి. దేశభక్తులు ఎవరు? దెబ్బలు తిన్నవారా? లాఠీలు తిన్నవారా? అంటే ఆనాటి పెద్దలు ఇరువురిని దేశభక్తులుగా పరిగణించారు. ఇది ఎంత వరకు సమంజసము? ఈ దేశం నాకు ఏమి ఇచ్చింది అనేది ముఖ్యం కాదు. నేను ఈ దేశానికి ఏమి చేశాను అనేది ముఖ్యం. సుసంపన్నమైన దేశ సంపదను కాపాడుటకు యువత నడుం భిగించవలసి ఉంది.

ఆనాడు ఛత్రపతి శివాజీ, వివేకానందుడు, మహాత్ముడు, డా॥ హెగ్డేవార్, అంబేద్కర్, అల్లూరి సీతారామరాజు, నేతాజీ మొ॥గు పుణ్య పురుషుల ఫలమే నేటి భారతావని. దేశభక్తి లేకపోతే స్వరాజ్యమే వచ్చేది కాదు. ఈనాటి దేశభక్తులు దేశానికి అపకీర్తి తీసుకొచ్చారు.

50సం॥లు స్వరాజ్యం వచ్చిననూ ఇంకా దేశము పట్ల భక్తి విశ్వాసాలు సన్నగిల్లాయని చెప్పవచ్చు. తరువాత కాలంలో వచ్చిన దేశభక్తులలో అవగాహన, భక్తిపారాయణ, విషయ పరిజ్ఞానం, సమైక్యత మొ॥నవి లోపించి ఉన్నాయి. కనుక పైన పేర్కొన్న అంశాలు పెంపొందించుకోవలసిన అవసరం ఎంతైనా ఉంది.

"జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసి"

## శ్రీ సత్యసాయిబాబా

అనంతపుర పుట్టపర్తి మూలబిందువు
అపార కరుణామృత రససింధువు
అనంతకోటి భక్తజన ఆత్మబంధువు
అఖండ మానవ జాతి ఆరాధ్య గురువు
అతడు భగవాన్ సత్యసాయి
అన్నిటా గోచరించు వటపత్రశాయి

అతని జాతి నీతి
అతని మతం మానవత్వం
అర్చనే క్రమశిక్షణ
ఆరాధనమే మానవ సేవ
అతని దైవం ప్రేమ
అతని సందేశం ఆ ప్రేమ మధురిమ

ఆ ప్రేమ తల్లి కాగలిగితే
సత్యమే తండ్రియై తోడునిలిచితే
జ్ఞానం పుత్రుడిలా ఎదిగి
శాంతం పుత్రికలా ఒదిగి
ధర్మం సంసారం చేస్తుంది
మనిషి జన్మ సార్ధకమౌతుంది
ఇదే బాబా ఆలోచన
ఇదే కావాలి అందరికీ ఆచరణ.

మతమంటే మంచితనం
మానవత్వమే దాని అంతఃసూత్రం
రహీమని ఎలుగెత్తినా
రామాయని స్తుతి చేసినా
బుద్ధం శరణమన్నా
జీసస్ అంచు స్మరించుకున్నా
అశాంతి బాయటానికే
ఆర్తి తెలియడానికే

అసలు నిజం బోధ పడడానికే
అందరొకటేనని గ్రహించడానికే
అని చెప్పే ఆ స్వామి సర్వాంతర్యామి
ఆత్మ జ్ఞాన సంపదలో అసాధారణ హేమాహేమి.

భక్తి రక్తి కావాలి ఆసక్తి పెరగాలి
భ్రమలు తొలగాలి ఏకాగ్రత కుదరాలి
సత్యావిష్కరణయే విద్యకు మూలం కావాలి
సేవా సౌభాగ్యమే మనోవాంఛిత ఫలం కావాలి
అదే జీవన మూలతత్త్వమని
అనాదిగా వస్తున్న వారసత్వమని
ప్రశాంతి నిలయమూర్తి సుభాషితం
ప్రపంచ శాంతి సాధనకది పరమహితం

శ్రీ సత్యసాయి కీర్తి
ఆనిండుమూర్తి స్ఫూర్తి
చిరస్థాయిగా నిలిచే చరిత్ర కావాలని
చిరంజీవత్వాన్ని సాధించి తీరాలని
కనిపించే ఆ భగవంతుడికి
కనిపెట్టి కాపాడే ఆ మానవుడికి

త్రికరణశుద్ధిగా
త్రిమూర్తుల సాక్షిగా.
సాగిలపడడమే జీవితం కాదు
సాష్టాంగ నమస్కారమే కర్తవ్యం కాదు.
ఆ స్వామి అడుగులు
అనుసరించడమే అందరికీ ఉపయుక్తం
ఆ బాబా మాటలు
అక్షరాలా బాటలు కావడమే శ్రేయస్కరం

-డాక్టర్ గుమ్మనూరు రమేష్‌బాబు

# కూష్మాండాదేవి

సురా సంపూర్ణ కలశం రుధిరాప్లుత మేవ చ
దధానా హస్త పద్మాభ్యాం కుష్మాండా శుభదాస్తు మే

దుర్గా మాత యొక్క చతుర్ధ స్వరూపనామం కూష్మాండా దేవి. తన మందస్మితం ద్వారా అండాన్ని అంటే బ్రహ్మాండాన్ని ఉత్పన్నం చేయడం కారణంగా ఈమె కూష్మాండా దేవి నామంతో పిలువబడుతూన్నది.

సృష్టియేలేని వేళ దశ దిశలా అంధకారం అలుముకున్న సమయంలో ఈ దేవియే 'ఈషత్ హాస్యంతో బ్రహ్మాండాన్ని సృష్టించింది. కనుక సృష్ట్యాది స్వరూపురాలూ, ఆదిశక్తి ఈమెయే. ఈమెకు ముందు బ్రహ్మాండ అస్తిత్వం లేనేలేదు. సూర్య మండలాంత ర్భాగంలో ఈమె నివసిస్తూంటుంది. సూర్య మండలంలో నివసించే శక్తి సామర్థ్యాలు ఈమెకు మాత్రమే ఉన్నాయి. ఆమె శరీర కాంతీ, ప్రభా సూర్యసమంగా దేదీప్యమానంగా ఉంటాయి. ఈమె తేజస్సు అతులనీయమైనది. ఇతరేతర దేవీ దేవతలెవరూ ఈమె తేజఃప్రభావాలకు సరితూగరు. ఈదేవి తేజోప్రకాశాల వల్లనే దశదిశలూ ప్రకాశిస్తూంటాయి. బ్రహ్మాండాంతర్గత సమస్త వస్తువులూ ప్రాణి మాత్రులలోని తేజస్సూ ఈమె ఛాయయే. ఈమెకు అష్టభుజాలు ఉండడం వల్ల 'అష్టభుజాదేవి' అన్న నామంతో ఈమె ఖ్యాతి గాంచింది. ఈమె సప్త హస్తాలలో క్రమంగా కమండల, దనుర్బాణ, కమల, అమృతకలశ, చక్ర, గదలున్నాయి. అష్టమ భుజంలో సర్వనిధులనూ, సిద్ధులనూ ప్రసాదించునట్టి జపమాల ఉంది. ఈమె వాహనం సింహం. సంస్కృత భాషలో గుమ్మడికాయను కూష్మాండమంటారు. ఈ దేవికి బలులలో కూష్మాండబలి విశేష ప్రీతిదాయకమైనది. ఈ కారణం వల్ల కూడ ఈమె కూష్మాండాదేవి అని పిలువబడుతున్నది. నవరాత్రులలో నాల్గవనాడు కూష్మాండదేవి స్వరూపార్చనయే జరుగుతుంది. ఆ రోజున సాధకుని మనస్సు అనాహత చక్రంలో లయమవుతుంది. కనుక తత్ సమయంలో సాధకుడు అత్యంత పవిత్రంగా అచంచల మనస్సుతో కూష్మాండ దేవి స్వరూపాన్ని ధ్యానంలో ఉంచుకుని పూజోపాసనలలో లగ్నం కావాలి. కూష్మాండ దేవి ఉపాసనలో భక్తుల రోగ,శోకాదులన్నీ నాశనమౌతాయి. ఈ జనని భక్తి ద్వారా ఆయుర్యశోబల ఆరోగ్యాలు వర్ధిల్లుతాయి. కూష్మాండా దేవి అత్యల్ప భక్తి సేవలకే ప్రసన్నమౌతుంది. యదార్ధమైన హృదయంతో మానవుడు ఈ దేవిని శరణువేడగలిగితే అతడు సుగమంగా పరమపదాన్ని పొందగలుగుతాడు.

## పురాణపండ రాధాకృష్ణమూర్తి

శాస్త్ర పురాణాలలో వర్ణించబడిన విధి విధానుసారం మనం దుర్గామాతను ఉపాసిస్తూ అహర్నిశలు భక్తి మార్గంలో పురోగమించాలి. మాతృ భక్తి మార్గంలో సాధకుడు కొన్ని అడుగులు మాత్రం ముందుకు వేయగలిగితే సాధకునికి ఆమె కృపాకటాక్షం యొక్క సూక్ష్మానుభవం కలుగుతుంది. దుఃఖ స్వరూపమైన ఈ సంసారం అట్టి భక్తునకు అత్యంత సుఖకరమై, సుగమ మవుతుంది. మాతృభక్తి మనుష్యమాత్రుని సహజంగానే భవసాగరం నుండి తరింపజేయడానికి సుగమమై శ్రేయస్కరమైన మార్గము. కూష్మాండా దేవి ఉపాసన మానవుని ఆదివ్యాధి దూరుని చేసి సుఖ, సమృద్ధి ఉన్నతుల వైపు పురోగమింపజేస్తుంది. ఐహిక పారలౌకికమైన ఉన్నతులను కోరే జనులు ఈ తల్లి ఉపాసనలో సర్వదా తత్పరులై ఉండెదరు గాక!

॥కూష్మాండా దేవికీ జై॥

# నీవేదో అదిగానే వుండు!

ఒకసారి ఒక యోగి దగ్గరకు ఒక యువసన్యాసి వెళ్ళాడు. యోగి వుండే చోటు ఇంకా సగం దూరంలో ఉండగా, ఒక మనిషి అతనికి ఎదురొచ్చి 'మీ కోసం యోగిగారు పంపారని' చెప్పి ఫలహారం, మంచినీరు ఇచ్చాడు. నిజానికి తానా యోగి వద్దకు వెళుతున్న సంగతి ఆ సన్యాసి ఎవ్వరికీ చెప్పలేదు.

ఎలాగో ఆ యోగి దగ్గరకు చేరాడు ఆ సన్యాసి. "నాకు ఉపదేశం చేయండి!" అనడిగాడు.

యోగి చిరునవ్వుతో "చాలా ఆలస్యం చేశావు. నేను నా దేహాన్ని వదిలేస్తున్నా" అన్నాడు. "నా కోసం ఒక రోజాగండి!" అని బ్రతిమిలాడాడు సన్యాసి.

"లాభంలేదు. నే వెళ్ళాలి', అంటూ యోగి కన్ను మూశాడు. డాక్టరు వచ్చి పరీక్షించి ఆయన మరణించారని ధృవపరచాడు.

ఆ యోగి శిష్యులలో అన్ని మతాలవారు వున్నారు. అయితే ఆయన మతమేమిటో ఎవరికీ తెలియదు. దానితో అక్కడ పెద్ద గలభా మొదలయింది.

'స్వామీజీ హిందువు. కనుక ఆయన శరీరాన్ని దహనం చేద్దాం' అన్నారు హిందువులు. 'కాదు. ఆయన ముస్లిం, ఫకీరు. కనుక ఆయన శరీరాన్ని ఖననం చేయాలి,' అన్నారు ముస్లిములు.

చినికి, చినికి గాలివానయినట్లు గొడవ ముదరటంతో పోలీసులు రంగ ప్రవేశం చేశారు. ఇంతలో ఆ యోగి టక్కున లేచి కూర్చున్నాడు. "మీరంతా ఈ కట్టె కోసం కొట్టుకుంటున్నారు. అందుకని నే చావొద్దనుకున్నా' అంటూ.

'ఇక దయచేసి మీరంతా వెళ్ళిపొండి. నేనెవరి మతానికీ చెందను. నేను చెందేది కేవలం భగవంతునికే' అన్నాడాయన.

తర్వాత ఉపదేశం కోసం వచ్చిన యువసన్యాసిని చూచి 'నేనింకా మూడురోజులుంటా. నీవు నాతో ఉండు' అన్నాడు.

'నీవేది కాదో అదే నీవని వంచించుకోవద్దు. నీవేదో అదిగానే ఉండు.' అని ఆ యోగి యువసన్యాసికి ఉపదేశం చేశాడు.

నాలుగోరోజు ఉదయం ఆ యోగి నదీ స్నానానికి వెళ్ళి తిరిగిరాలేదు. ఆయన శరీరం ఎంత గాలించినా దొరకలేదు!

**- భండారు పర్వతాలరావు**

# దేవీ వినుతి వీణ

మెయియోగాగ్నిని గాల్చుచు.
దయవిడి తండ్రియనక మద దక్షునివధ, నీ
ప్రియ పతి పరముంజేసిన
జయ శీలవుగాదె నీవు జననీ దేవీ!

గిరి సార్వ భౌమ సుతవై
విరతము శంకరు(దపించి నిర్భుక్తిమెయిన్,
ధర నస్వీకృత పర్ణవు
గరహించు, టపర్ణయనగ్రాలెదు దేవీ:

శివుని యెడల, శృంగారము
దివినది యెడ క్రోధ, మహితతి యెడ భయమిటుల్
నవరస భరదృక్కులు గల
శివ! నీకరుణామృతమ్ము చినుకుము దేవీ!

కందవి తెలిగన్నేరులు
సుందర శుచి పారిజాత సుమచయములు, యిం
దిందిర బృందము వ్రాలని
ముందఱ( గొని హారు భజించి మ్రొక్కెదు దేవీ!

హరశీర్ష నదీపావన
మరవిందోదరుని మస్తకాభరణాభం
బురు నిగమ శిరోవహవమౌ
పరపదములు బెట్టుము తల వంచితి దేవీ!

ఓ జననీ! త్వత్పతి వి
భ్రాజిత కీర్తి పొగడ నట వాణియు హొందున్
నీజిహ్వారుణ కిరణ స
మాజపుటెట్టుందవమ్ము మాతాదేవీ!

**- పృథివి**

## మంచి అవకాశము

87215
S.T.D. 08555



# శ్రీసాయిహరి రియల్ ఎస్టేట్స్

## పుట్టపర్తి

**మీకు పుట్టపర్తి యందు ప్లాట్లు ఇండ్ల స్థలాలు కావలసినవారు, అమ్మదలచినవారు ఈ క్రింది అడ్రసుకు సంప్రదించవలెనని కోరడమైనది.**

1. సూపర్ స్పెషాలిటి హాస్పిటల్ ఎదురుగా గల ప్లాట్లు.
2. గోకులం పోస్టాఫీస్ ఎదురుగా గల ప్లాట్లు.
3. M.R.O. ఆఫీసు ఎదురుగా గల ప్లాట్లు.
4. బీడుపల్లికి పోవు బస్సు రోడ్డుకు గల ప్లాట్లు.
5. అపార్ట్‌మెంట్స్ కావలసినవారు.
6. ప్రశాంతి నిలయము దగ్గరలో గల ప్లాట్లు.

***ప్రతినెలా 10వ తేదీన వాసవీ నివాస్ నందు డ్రా తీయబడును.***

**క్రొత్తగా ప్రవేశపెట్టిన స్కీములో చేరండి 20X40 రెండు సెంట్లకు నెలకు రు. 600-00. 36 నెలలు. "మారుతీ కారు బంపర్ డ్రా"**

ఇట్లు

శ్రీ సాయి హరి రియల్ ఎస్టేట్స్

**ప్రొ|| పి. సిద్దయ్య శెట్టి**

ఆర్యవైశ్య సంఘము వైస్ ప్రెసిడెంట్

**ఆర్యవైశ్య సత్రం ఫ్రంట్ రూమ్, పుట్టపర్తి.**